# విషయాలు


| | | | |
|---|---|---|---|
| 1. | ముందుకి | ... | 9 |
| 2. | చీకటి | ... | 13 |
| 3. | ఇల్లు | ... | 16 |
| 4. | గొడ్డలి | ... | 20 |
| 5. | బ్రెడ్ | ... | 24 |
| 6. | అనంతరం | ... | 29 |
| 7. | కన్ని | ... | 33 |
| 8. | సెటిల్‌మెంటు | ... | 38 |
| 9. | వయసుతో మాధుర్యం | ... | 42 |
| 10. | షుమక్‌లో కేబిన్ | ... | 49 |
| 11. | జెన్ని | ... | 55 |
| 12. | నూలీ | ... | 59 |
| 13. | విశాల ప్రపంచం | ... | 70 |
| 14. | ఉత్సవం రోజున | ... | 75 |
| 15. | వేటగాడు | ... | 84 |
| 16. | మార్గమధ్యం | ... | 91 |
| 17. | ఒకరోజున | ... | 102 |
| 18. | మార్పు | ... | 109 |

# ఎన్. ఆర్. చందూర్ మిగతా పుస్తకాలు



బాలరాజ్యం
శిక్ష
అంతేనా
కాఫీ మానెయ్యడం
ఎక్కడికి కమలా ?
భానుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్తలోకాలు
కొన్ని గ్రంథాలు
సీతతో సినీమాకి
నట్టింటదీపం
గ్రామవైద్యుడు
ప్రతి గురువారం
నాలుగురోడ్లు
ఆరు కథలు
నవచైనా
మాంగుళూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతాఫలాలు
భాష
పరిచయంచేసిన పుస్తకాలు
పూసలమేడ
అన్యాయం
శివరావు
ఆఖరుకోరిక
కలదో లేదో
అణుశక్తి
ఈ నాగరికత



# రచయిత

కాన్రాడ్ రిచ్‌టర్ పెన్సిల్వేనియా రాష్ట్ర నివాసి - తండ్రి ఒక ప్రొటెస్టెంట్ మతగురువు. హైస్కూలు చదువు పూర్తిచేశాక, రిచ్‌టర్ రకరకాల ఉద్యోగాలు చేశాడు. యంత్రాల షాపులో పనివానిగా, బొగ్గు కార్మికునిగా, బ్యాంకు గుమాస్తాగా, రకారకాల వృత్తులు. వ్యవసాయంలో కొన్నాళ్లు కాలక్షేపంచేసి, చివరికి స్వంతంగా కలప వ్యాపారమొకటి పెట్టాడు. ఆ తర్వాత జాన్స్ టవున్‌లో కొన్నాళ్లూ, పిట్స్‌బర్గులో కొన్నాళ్ళూ పత్రికా విలేఖరిగా పనిచేశాడు. జీవితంలోని వివిధరంగాల అనుభవం, పత్రికా వ్యాసంగంలో అతనికి బాగా పనికొచ్చింది.

'చెట్లు' (The Trees) అనేది ఆయన వ్రాసిన మూడు ముఖ్య పుస్తకాలలో ఒకటి. చెట్లు, పొలాలు (The Fields) పట్నం (The Town) ఈ మూడూ కలిపి ఒక ఉద్గ్రంధంగా పేర్కొంటారు. దేనికది విడివిడి నవల అయినప్పటికీ, ఈ మూడుపుస్తకాల మొత్తం, అమెరికా ప్రజల ప్రారంభజీవనాన్ని, అనాటి కష్టనష్టాలతో, ఉదాత్తంగా ప్రదర్శిస్తుంది.

రిచ్‌టర్ వయసు 62 సంవత్సరాలు, ఇప్పుడాయన సంవత్సరంలో కొంత భాగం పెన్సిల్వేనియా రాష్ట్రంలోనూ, మరికొంత భాగం న్యూ మెక్సికో రాష్ట్రంలోనూ గడుపుతున్నాడు.

# 1. ముందుకి

కొన్ని కుటుంబాలు సముద్రాన్ని నమ్ముకొని ముందుకి పోతే, మరికొన్ని కుటుంబాలు అడవులవెంటపడి ముందుకి పోతాయి. దట్టమైన ఆ చెట్ల గుబురులో, సంధ్యాకాంతిలా ఉన్న మిట్టమధ్యాహ్నంవేళ, తండ్రి వీపుమీద మూపురం మొలిచిందా అన్నట్టు వుంది ఒక మూట. ఆ మూటలో ఒక తుపాకీ, తుపాకి సామానూ, కమ్మరివాని పనిముట్లూ, బియ్యంసంచీ, ఒక జత పసుపు పచ్చ దుప్పట్లూ ఉన్నాయి.

చిన్నకాగూ మిగతా చిల్లరసామానులూవున్న పెద్దకాగు సేవర్డు పుచ్చుకుంది. బొంతలూ రజాయిలూ జెన్ని కప్పుకుంది; ఆశ్బా ఆహారపదార్థాలబుట్ట మోస్తోంది. చిన్నవాళ్లయిన పియిటర్, సూలీలుకూడా వారివయసుకితగ్గ బట్టలమూటో, కర్రలగొడ్డలో ఏదో ఒకటి మోస్తూనే ఉన్నారు. ఒక్క జేరీలకెట్ (అంటే తల్లి) తప్ప అందరూ వారి వారి శక్తికితగ్గ బరువులు మోస్తున్నారు. జ్వరపడి నీరసించి వుండటంచేత, జేరీలకెట్ మాత్రం, ఒక పెద్ద ఓవర్‌కోటు బుజంమీద వేసుకొని నడుస్తోంది.

బాదంచెట్ల ఆకులింతలు సన్నబడటంతో, ఈఏడు కరువు తప్పదనుకున్నాడు వర్త్. అందుకనే జంతువుల్ని వేటాడేనిమిత్తం, పెన్సిల్వేనియా వదిలేసి, ఈ అడవిలోకి వస్తున్నాడు. ఆహారానికి కరువు రాబోయేసూచన నెల్లాళ్ళబట్టీ గమనిస్తూనే ఉన్నాడతను. ఎలుగుగొడ్లకీ, పావురాలకీ ఈ ఏడు మరీకష్టమవుతుంది. లేళ్ల మార్గాలూ కనపడటంలేదు. ఉడతలు దేశాన్నివదిలి పారిపోతున్నాయి. ఉడతలు పారిపోవడాన్ని తనొక్కడే కాదు, పిల్లలుకూడా చూశారు. పడమటిదిక్కుగా ప్రయాణమవడం కంటె చేయగలదేమీ లేదు - అని నిశ్చయించుకు యిలా వస్తున్నారు.

ఈ నిశ్చయాన్ని తాళ్లవుయ్యాలమీద కూర్చున్న జేరీ శాంతంగా వింది. ఏదో ఒక సాకుతో యిక్కడనుంచి తప్పుకుపోయేందుకు వర్త్ చూస్తున్నాడని ఆమెకి తెలుసును. కష్టసుఖాలూ కలిమిలేములూ నిశ్చలతత్వంతో గ్రహించగల ఆ యిల్లాలు, నోరు కట్టేసుకువుండలేక, "అయితే, ఓహియో నదిదాటి వెళ్లాలని ఉద్దేశమా?" అంది భర్తతో.

అతను తల వంకించాడు. తల్లి పక్షాన ఏమంటుందో నేవర్డ్‌కికూడా తెలియదు.

"నేను అక్కడికి రానని ఎన్నోసార్లుచెప్పాను. సరి, ఏం చేస్తాం - వేటాడేందుకు జంతువుల్లేక, తినేందుకు తిండి లేనప్పుడు ఏం చేస్తాం?" అంది అమ్మ.

ఆ సంధ్యకాంతిలో పిల్లలు నలుగురూ, కేబిన్‌లోనుంచి బయటికివచ్చి, వాళ్లకి తోచినది వాళ్లు చెప్పుకోవడం మొద

పెట్టారు. పెద్దమ్మాయి సేవర్డ్ మట్టుకు నిప్పులపొయ్యిదగ్గిరికివెళ్ళి, అందులోనిమంట కొద్దిగా కదిపింది. వాళ్ళ చిట్టితమ్ముడు పుటకలు చూసినప్పట్నుంచీ, మనసులో భావాలన్నీ పైకి అనడం మంచిది కాదనే సత్యాన్ని తెలుసుకుంది సేవర్డ్. ప్రపంచంలోని మనులందరికంటె అతిముద్దుగా ఉంటాడు తమ చిట్టితమ్ముడు. వాడు కేరున ఏడ్చేదాకా, ఆ చిన్న దేహాన్ని ఎంతగట్టిగా బాదింది తను!

ఇప్పుడు ఆమె చిన్నపిల్ల కాదు - పదిహేనేళ్ళది. మంటల కాంతిలో ఆమెలేత కాళ్ళు తళతళలాడుతున్నాయి. ఆమె ఆకారానికి స్త్రీత్వమొచ్చింది. జీవనోద్వేగం ఆమెలో నదీప్రవాహానికి మల్లే పరుగులు పెడుతోంది.

వారు ఓహియోనదిని దాటారు. ఇప్పుడు కాళ్ళకి తగులుతున్న బురద పెన్సిల్వేనియాలోని ఎర్రమన్నువంటిది కాదు; పోనీ, బూడిదవర్ణంకూడా కాదు. నల్లగా అవుపేడలా ఉంది. ఈ ప్రాంతాన కొండగుట్టలు ఎక్కువ. ఒక గుట్ట ఎక్కుతూ, యిక్కడి గాలికూడా పెన్సిల్వేనియాలోని గుట్టలమీద గాలివలె ఆహ్లాదకరంగా ఉంది - అంది జేరీ. దూరమై, వెనకపడిపోయిన పెన్సిల్వేనియాగుట్టల్ని, వదిలెయ్యడం మనసుకిహాయి అనిపించింది కాబోలు ఆమె! కనిపించవని తెలిసినవాటికోసం, కలవరపడటం దేనికి ?

ఒక కొండగుట్టచుట్టూ తాను తిరిగివచ్చేవేళకి, సేవర్డ్కి, 'తండ్రి తమని పశ్చిమసముద్రంవైపు తీసుకొచ్చాడా' అనిపించింది. ఆ సూర్యాస్తమయకాంతిలో అవుపచ్చని విస్తృత జలాశయం ధగధగలాడుతోంది. ఇంకొంచెం పరీక్షగా చూసే

టప్పటికి, అది జలంకాదనీ, పచ్చటిచెట్ల సమూహామనీ తెలిసింది. కనుచూపుమేరవరకూ చెట్లే! అనంతవృక్షవారిధి !

ఎక్కడివాళ్లక్కడ నిలబడి, ఆ దృశ్యాన్ని చూడసాగారు. చుట్టుపట్ల ఏదైనా సెటిల్‌మెంటుగానీ, జనసంచారంగానీ కనిపిస్తుందేమోనని పరిశీలనగా తల్లి చూడటం సేవర్డ్ కనిపెట్టింది. ఎక్కడా పొగ అన్నమాటలేదు. అంటే, మనుషులు లేరనేగా! ప్రొద్దువాలిపోయి, నీడలు పొడుగవడంతో, ఆ నీడలతోపాటు తల్లి మదిలో దిగులు హెచ్చు కాజొచ్చింది.

దూరాన ఎక్కడో ఒక చిరుతపులి తోడేలుని పట్టుకోగా, తోడేలు ఆక్రందనా చిరుతపులి ఆర్భాటమూ వినిపించాయి.

"అదుగో, అదుగో - యిక్కడకావలసినన్ని జంతువులు దొరుకుతాయి," అన్నాడు సేవర్డ్, ఏదో వాసన పసిగట్టినట్టు!

సేవర్డ్ తమ్ముళ్లవంకా, చెల్లెళ్లవంకాచూసింది. వారి మనోవీథిలో ఏమి మెదిలాయంటే, తమ తండ్రి తీసుకువచ్చే జంతుచర్మాలు. అవి స్కియొటూలోగాని ఓహయోలోగాని వున్న వర్తకునికి యిస్తే, అతను తెల్లటి యింగ్లీషు బ్లాంకెట్లూ ఎరుపూ నీలం అంచుల టర్కిష్ శాలువలూ మొదలైనవి యిస్తాడు.

"మనం భాగ్యవంతులమై జోళ్లుకూడా కొనుక్కోగలుగుతామేమో!" అంది సూలీ.

## 2. చీకటి

సముద్రంలాకనిపించిన చెట్ల ప్రపంచానికి అడుగు నున్నామనే భావం, సేవర్డ్‌కి ఆశ్చర్యం కలిగిస్తూవుండేదప్పుడప్పుడు. మహారణ్యమధ్యాన యిదేమిటని వణికేది జేరీ. తలపైకెత్తితే ఆకాశమెక్కడైనా కనిపిస్తుందేమోనని తల్లీ కూతుళ్లు మహా చూసేవారు. కాని, వారి చుట్టూ చెట్లూ, చెట్ల ఆకులూ. రోజంతా నడిచినా ముందుకో వెనకకో తెలిసేదికాదు.

అడవిలో చొరబడ్డారన్నమాటేగాని, ఆపైన ఏమవుతున్నదీ వారికి అవగాహన అయ్యేదికాదు. సేవర్డ్‌కి దిగులేసినప్పుడల్లా, తండ్రిచెప్పినకథ జ్ఞప్తికి తెచ్చుకుంటూండేది.

ఒకరోజున వర్త్ తుపాకీ చేతబుచ్చుకు అడవి అంతా తిరుగుతున్నాడు. దేవదారుచెట్లూ మర్రివూడలూ మధ్యతిరుగుతూండగా, ఆచీకటిలోనుంచి, ఆ అడవిలోనుంచి పారిపోవాలనిపించింది. భయంతో ఒళ్లంతా చెమటలు పట్టింది. పడమటినుంచి వచ్చిన యిద్దరువేటగాళ్లు తమకీ అదేవిధంగా సంభవించిందన్నారు.

ఎంచేత అలా వస్తుందో వాళ్లకి తెలియదట. అరణ్యమధ్యంలో ఉన్నప్పుడే ఆ ప్రకారం జరుగుతుందట.

"ఆ - యిదేమీలేదు; వుడ్స్ ఫీవర్ (Woods Fever) అని తనని తను సరిపెట్టుకొనేది సేవర్డ్. ఇంతటి అరణ్యమధ్యంలో తల్లి మొగం కాస్త తేలికగా ఉండటం ఆమె గమనించింది.

ఒకరోజున తల్లి "ఇంగ్లీషుసముద్రాలకి దగ్గరలో ఉన్న పీఠభూమి చాలా బాగుంటుందట!" అని వర్త్‌తో అంది.

"అవును, నీలాటివాళ్లకికూడా చాలా మంచిది," అన్నాడు వర్త్.

"పోనీ, అంతదాకా నడుద్దాం. నాకాళ్లలో శక్తిఉంది. నేను నడవగలను," అంది జేరీ.

"ఇదిగో, యిక్కడ వేట అయిపోయిన తర్వాత."

"అక్కడకూడా జంతువులు పుష్కలంగా ఉంటాయట," అంది జేరీ.

కాని, వర్త్ ఆవిషయం అక్కడితో ఆపేశాడు. అతనికి ఆ పీఠభూమిలోని మనుషులంటే యిష్టంలేదు; ఎంతయినా, వాళ్లు తనలోటి ప్రజలుకారు.

కుడిపక్కగాగాక, ఎడమచేతివైపుగా ప్రయాణంసాగించేటప్పటికి జేరీముఖం ముకుళించుకుపోయి, మరీ నల్లబడింది.

"అటువైపుగావెళ్తే వేట దొరకదు కాబోలు - సరి, నాకెందుకు? అమ్మాయి సేవర్డ్, నేనేమైనా అయిపోతే, ఆయన

గార్ని యిష్టమొచ్చినదారిని పోనియ్యక, తిరిగీ పెన్సిల్వేనియా చేర్చవలసిన భారం నీది!" అందిజేరీ.

"నాకు పెన్సిల్వేనియా వెళ్ళాలని అనిపించకపోతే?" అని ప్రశ్నించింది సేవర్డ్.

"అదిగో, పుట్టినచోటుగురించి అలా మాట్లాడకూడదు అని చెప్పలేదూ?" జేరీ కంఠనాళాలలోని రక్తం గబగబా పరువు లెత్తింది.

వాటిని ఆ దగ్గిరలోవున్న ఒక వాగుప్రక్కకి తీసుకు వెళ్ళాడు వర్త్. అడవిలోనుంచి పారుతున్న నీటివాగు అది. ఆ నీటివాగు నిండాకలప. అక్కడినేల నల్లగా బొగ్గుమాదిరిఉంది. ఆ నేల రంగు చూసి జేరీ భయపడింది.

"ఇక్కడ మనం కేబిన్ కట్టుకోవాలనా? కేబిన్ కట్టుకు నేందుకు కర్రలుకూడా దొరకవే!" అంది జేరీ.

"అదిగో ఆ పక్కగాచూడు, ఆ గెడలూ ఆ చెట్లూ - యింత చక్కటి స్థలం ఈ చుట్టుపట్ల ఎక్కడా లేదు."

ఆయాసంతో, వూపిరి తీసుకునేందుకు తప్ప, మళ్లీ నోరు మెదపలేదు జేరీ.

# 3. ఇల్లు

ప్రయాణం పూర్తయిందని వినడంతో, పిల్లలందరికీ ఎంతో సంతోషం కలిగింది. మోస్తున్న బరువులు క్రిందికి దించి, "హమ్మయ్య" అనుకుంటూ కుప్పిగంతులు ప్రారంభించారు.

వర్త్ తన నలుపలకల గొడ్డలితో చిన్న చెట్లు పడగొట్టడమూ, జేరీ వాటన్నిటినీ ఒక క్రమతలో చేర్చడమూ సేవర్డ్ చూస్తూవుంది. ఎంతకీ ఆకాశం కనపడటం లేదే అని ఆమెదిగులు. ఎంత త్వరగా కేబిన్ పూర్తయితే, అంత మంచిది - అని భావిస్తున్నాడు వర్త్.

ఏదైనా వేటజంతువులు అటుగావస్తే, సేవర్డ్ కనిపెట్టి, తండ్రికి చెప్పేది. అప్పుడతను చేతిలోపని, అక్కడిదక్కడ వదిలివేసి, ఆ జంతువువెంట పరిగెట్టి, దానిని వేటాడి పట్టుకొచ్చేవాడు.

నెమ్మది నెమ్మదిగా కేబిన్ పూర్తవుతోంది. జంతువులు సులువుగా దొరుకుతూఉండటంవల్ల, వర్త్ పగటివేళంతా వేటాడటంలో గడిపేవాడు. రాత్రివేళ యింటిల్లపాదీ సుష్టుగాతిని

హాయిగా నిద్రపోయేవారు. చెట్లమీద వేళ్లాడదీసే జంతుచర్మాల సంఖ్య పెరగ జొచ్చింది.

"మంచు వాసన తెలుస్తోందికదూ!" అంది సేవర్డు ఒక రోజున తల్లితో.

"తేదీలు లెక్కపెట్టడం మానేశాను," అంది జేరీ, ఏదో నిరాశగా.

సేవర్డు తన పనిమీద తను వెళ్లిపోయింది. మంచుపడే కాలం రాకపూర్వమే, కేబిన్ పూర్తిచేయడం క్షేమదాయకమని, అమ్మకీ నాన్నకీ తోచచప్పుడు మధ్య తనకెందుకు? ఆ ఉదయం వేళ, లేళ్లబాటలోని సిందూరకాయలు, ఆమెపాదాలకి తెగ గుచ్చుకుంటున్నాయి. పొట్టి గౌనువేసుకుని వుండటంవల్ల, మోకాళ్ల దగ్గిరనుంచి బాటన వ్రేళ్లదాకా ఒక చలి!

ఇలావుండగా, ఒకరోజు ప్రొద్దుట వర్షం ప్రారంభించింది. పగలంతా కురుస్తూనేవుంది. చీకటిపడే సమయానికి ఈదురుగాలి అందుకుంది. ఆ ఈదురుగాలి కాస్సేపు వీయడం, మళ్లీ వూరుకోవడం – ఈవిధంగా దోబూచులాడింది రాత్రంతా.

తెల్లారేసమయానికి గాలీవర్షమూ రెండూ మటుమాయమయాయి. సేవర్డు కళ్లు తెరిచేసమయానికి, సూర్యకాంతి కళ్లల్లోకి పొడిచింది. కొంచెందూరంలో తల్లి నుంచుంది. రాత్రి తుపానుకి చెట్ల ఆకులు సగందాకా రాలిపోయినట్టున్నాయి. అప్పుడే పర్వత గుహాలోనుంచి బయటకొచ్చిన మనిషిలాఉంది తల్లి.

"ఈ రోజు చూస్తానని అనుకోలేదు," అంది ఆమె సేవర్డుతో.

జేరీ ఎండలోకూచుని, కూతురిచేత తలదువ్వించుకుంది; ఆ ఎండవెలుగు ఆమె ముడతలుపడ్డ మొగానికికూడా కాంతి నిచ్చింది. పక్కగా పారుతున్న నీటివాగులో కాళ్లూచేతులూ కడుక్కొని, తడిగావున్న దుంగమీద చితికిలబడి, ఆకులఅడుగున దాచిన తుపాకీ పొడిగా ఉందో లేదో చూస్తున్న వర్తుతో అంది జేరీ: "కేబిన్ కడదామనుకున్నాముగా!" - ఆమె చూపులు కఠినాతికఠినంగా ఉన్నాయి.

భార్యవెటకారానికి వర్తుకి వుక్రోషంవచ్చింది. గోనె పీలికతో తుపాకీ పరిశుభ్రంగాతుడిచి, దానిని ఒకమూల భద్ర పరిచి, గొడ్డలిపుచ్చుకు బయలుదేరాడు. దుంగలు నిలబెట్టడం లోనూ, అడ్డకర్రలు పేర్చడంలోనూ సేవర్డూ, ఆశ్బా అతనికి సాయపడ్డారు.

"ఈరాత్రికి మన కుటీరం రెడీ అయిపోతుంది" అన్నాడు వర్తు. పొద్దుగూకేందుకు యింకెంతసేపో లేదు. చాలామట్టుకు అయిపోయినట్టే - పొగగొట్టం ఒక్కటి అమర్చాలి.

"మంచు కురుస్తోంది," అంది ఆశ్బా ఆ సాయంత్రం వేళ.

"మంచా?" అంది జేరీ వణుకుతూ.

తల్లి నేత్రాలు కేబిన్ వంక ఆశగాచూడటం సేవర్డు కని పెట్టింది. కేబిన్‌లోని నిప్పులకుంపటీ, మాతృహృదయం ప్రసరించే కరుణాపూరిత వీక్షణాలూ ఆ పదిహేనేళ్ళమ్మాయి మనసులో మెదిలాయి. తమకి తలదాచుకొనేందుకు ఒక స్థలమంటూ ఏర్పడింది; బియ్యపుసంచి దూలానికి వేళ్లాడుతోంది. సేవర్డుతల్లి, తన సంతానానికి వెచ్చటిచోటు దొరికిందికదా అని, ఆత్మతృప్తితో నిద్రపోగలిగింది ఆ రాత్రి.

# 4. గొడ్డలి

కేబిన్ నిర్మాణంతో, వారు మనుష్యుల స్థితికి రాగలిగారు. అడవిజంతువులు తమకుటీరం మీదపడకుండా, కేబిన్ చుట్టూ ముళ్లకర్రలమాదిరివి ఏర్పాటుచేయసాగాడు వర్తు. సూది వలె మొనదేలివుండే ఈ కర్రలు జంతువుకి గుచ్చుకుంటాయి - అందుకని, అది కేబిన్‌మీద పడలేకపోతుంది. చుట్టూతా ఈ మాదిరి కర్రసూదులు కట్టాక, తాము కూర్చునేందుకు ఒక బల్ల, కేబిన్‌కి ఒక తలుపుకూడా తయారుచేశాడు వర్తు. అక్కడి తో వ్రారుకోక, ఎలుగునూనె పూసినకాగితమొకటి, ఆ చీకటి కేబిన్‌లోకి వెలుతురువచ్చేందుకు 'స్కాయ్‌లైట్' మాదిరి అమర్చాడు.

కొన్నాళ్లయేటప్పటికి, ఆ చుట్టుపట్లనున్న రెడ్ యిండియనులు, వర్తు కేబిన్‌కి మాటాపలుకూ చెప్పుకునేందుకు రాసాగారు. వర్తు వారికి ఎంతో ఆతిథ్యగౌరవం చూపించేవాడుగాని, జేరీకి వాళ్లందరూ అనవసరంగా తినిపోతున్నారని చింతగాఉండేది. "మనయింట్లోవున్న బియ్యం అయిపోయేదాకా మెసతాను;

అలా దాచుకోవడం నాకు యిష్టముండదు,” అన్నాడు వర్తు ఒకరోజున జేరీతో నిష్కర్షగా.

“ఆ కాసినినిగింజలూ అయిపోయాక పిల్లలు ఏమవుతారు?”

“నేను వాళ్ల యింటికి వెళ్లినప్పుడు, వాళ్లు నాకు కడుపు నిండా పెట్టడం లేదూ? అలాగే, వాళ్లు మనింటికివచ్చినప్పుడు నేనూ పెట్టవల్సిందే!” అన్నాడు వర్తు.

“వాళ్ల యిళ్లకి వెళ్లొద్దు.”

“వెళ్లకుండా కుదరదు. వాళ్లు నీకు పనికిరాకపోవచ్చు; నాకు పనికొస్తారు.”

ఆపైన జేరీ ఏమిమాట్లాడగలదు? ఆరోజంతా భార్యాభర్తలు ఎడమొగం పెడమొగంగా ఉన్నారు. వర్తు మర్నాడు పొద్దుటే తుపాకీ పుచ్చుకు బయటికిపోయి, చీకటిపడ్డాకూడా రాలేదు. ఆమర్నాడు బ్రహ్మాండంగా చలీవర్షమూ.

ఆ సాయంత్రంవేళ ఏదో అడుగులచప్పుడు విని, ‘నాన్న వస్తున్నాడు’ అంది సూలీ. నాన్న అనుకుని, కేబిన్ తలుపు తెరిచేటప్పటికి, గుమ్మంముందర చలికి గడగడలాడుతూ, ఒక రెడ్ యిండియన్ నుంచున్నాడు. తలుపు తెరిచీ తెరవగానే, అతను గభాలున లోపలికివచ్చి, నిప్పులపొయ్యిదగ్గిర చలికాచుకోసాగాడు. జేరీకి మహాకోపంగా ఉందన్నమాటేగాని, అటువంటి చలిలో ఒక ప్రాణిని బయటికి గెంటడానికి మనస్కరించలేదు.

కాసేపు చలికాచుకున్నమీదట, ప్రాణాలు కొంచెం వెచ్చబడ్డాక ఆ రెడ్ ఇండియన్ చుట్టూ కలయచూచేడు. అటు

వంటి మనిషిని ఎప్పుడూచూసిన జ్ఞాపకంలేదు సేవర్డుకి. అతని ముక్కు బంగాళాదుంపలా ఉంది; కళ్లుకూడా బంగాళాదుంపల్లా గానే ఉన్నాయి. ఆరాత్రికి అతనికి తమభోజనంలోనే భాగం పెట్టారు; కాని అతను చాలాకొద్దిగా తిన్నాడు. అంతకొద్దిగా తిన్నాడేమిటని సేవర్డు ఆశ్చర్యపోయిందికూడా.

నిప్పులపొయ్యిలో మరికాసినిప్పుల్లువేసి, ఎవరికివారు నిద్రకి విశ్రమించారు. నడుము వాల్చగానే కళ్లు మూసుకు పోయాయిజేరికి. కాని, సేవర్డుకి వెంటనే నిద్రపట్టలేదు. తమ కేబిన్‌లో, తమకి తెలియని కొత్తతనువున్నాడు. అతను ఎటు వంటివాడో? ఆదమరిచి నిద్రపోవడం మంచిది కాదు - అని అను కుంటూవుండగానే, ఏదో ఆకారం కదిలినట్టయింది. ఆ రెడ్ యిండియన్ నిప్పులపొయ్యిదగ్గిరకెళ్లి కూచుని, జేబులోనుంచి కత్తి, కోటుఅడుగునుంచి మాంసమూతీసి, ఆ మాంసం నిప్పుల మీద కాల్చుకతింటున్నాడు. సేవర్డుకి భయాశ్చర్యాలు రెండూ కలిగాయి.

మర్నాటిపొద్దుటికూడా హిమపాతం తగ్గలేదు. కాస్త పొద్దెక్కేవేళకి, రెండు లేడిచర్మాలు బుజానవేసుకు వచ్చాడు వర్తు.

"గొడ్డలి ఆకుల అడుగున మంచులో వుంచవద్దని మీకు ఎన్నోసార్లుచెప్పాను" అని అరుచుకుంటూ లోపలికివచ్చాడు వర్తు.

సేవర్డు గొడ్డలిని అక్కడనుంచి తీసింది.

"అయితే, నువ్వూ అమ్మా రాత్రి యిక్కడ పడుకున్నా రన్నమాట," అని అడిగాడు వర్తు.

అవునంది సేవర్డు.

రెడ్ యిండియన్ ఏదోవిస్మయంతో అందరివంకచూస్తూ, తనలో తను నవ్వుకున్నాడు. వర్తుమట్టుకు నవ్వలేదు.

రెడ్ యిండియన్ వెళ్లిపోయాక వర్తుఅన్నాడు: "నేను లేనప్పుడు వీళ్లని చేరనివ్వకు."

"రెడ్ యిండియనులంటే తమకి యిష్టమేగా!" అంది జేరీ.

"వాళ్లతో నేను నెగ్గుకురాగలను - నీకు చేతకాదు," అన్నాడు వర్తు ముక్తసరిగా.

# 5. బ్రెడ్

"బ్రెడ్ ఎక్కడయినా దొరికితే బాగుండును. అదొక్కటే నోటికి హితవుగా ఉండేటట్టువుంది," అంది జేరీ ఒకరోజు పొద్దుటివేళ.

తనతల్లికి ఈ భూమిమీద యింకెన్నోరోజులు లేవని సేవర్డుకి తెలుసు. రక్తమాంసాలని కొరుక్కుతినే జ్వరమది.

"ఎక్కడయినా గోధుమరొట్టె దొరికితేబాగుండును. అది తింటే నాకు కాస్తశక్తి వస్తుందేమోనని ఆశగా ఉంది," అంది జేరీ.

వర్తు పైకి ఒక్కమాట అనలేదు. కాని, అతనిముఖంలోని నిశ్చయం సేవర్డు గ్రహించగలిగింది. బ్రెడ్వుంటే బాగుండునని జేరీ రెండుసార్లు వెలిబుచ్చింది.

"మిమ్మల్ని ఏదో అంటున్నానని భావించకండి, మీరు మాకు ఏం తక్కువచేశారు? చాలామందికంటె మనమే సుఖపడుతున్నాం. మనరోజులు అలావున్నాయి. మిమ్మల్ని అంటున్నానని అనుకోకండేం!" అంది జేరీ భర్తతో.

ఆ మర్నాడువుదయం వర్తు, బుజాన పెద్ద తోలుసంచీ వేసుకు, "అమ్మాయ్, అయిదారు రోజులదాకా రాను; అమ్మనీ పిల్లలనీ జాగ్రత్తగా కనిపెట్టి చూసుకుంటూవుండు," అన్నాడు సేవర్డుతో.

తండ్రి ఎక్కడికి వెళ్తున్నాడో సేవర్డ్కి బోధపడలేదు.

వర్తు వెళ్ళిన మూడవరోజు సాయంత్రం, జేరీ ఖంగు ఖంగున దగ్గడం మొదలుపెట్టింది. గాలిగొట్టాం చిల్లిబడి గుండె లలో రక్తం బయటికి తన్నుతున్నట్టయింది. విపరీతంగా దగ్గిన మీాదట కొంచెం రక్తం పడటాం, ఆ పైన ప్రాణం తెరిపి యిచ్చినట్టవడం. అలా రక్తం పడ్డప్పుడల్లా మనిషి సొమ్మసిలి పోయి, ముఖం తెల్లపడి, తేలికయిచ్చినట్టయేది.

అయిదురోజులదాకా సేవర్డు తండ్రికోసం ఎదురుచూడనే లేదు. అది అయిదోరోజు రాత్రి. జేరీ ఎంతో బాధపడి నిస్త్రాణతో కళ్లు మూసుకుని వుంది; తల్లి కక్కుకుంటున్న రక్తం చూడట మంటే జెన్నీకి తగని భయం - అందుకని ఆ అమ్మాయి ఎప్పుడూ దూరదూరంగానే ఉండేది. సేవర్డు ఒకవంక తల్లిని కని పెడుతూ, మరొకవంక పిల్లలని సాదుకుంటూ ఉండేది. బాగా అలిసివున్న సేవర్డుకి, అయిదోరోజు రాత్రి, అడవిలో ఏదో అలికిడి వినిపించింది. తమ కేబిన్ లోని పొగకి, ఆ చుట్టుపక్కల నున్న అడవిజంతువు ఏదైనా అక్కడికి వచ్చిందేమో అనుకుంది. అర్ధరాత్రివేళ అడవిలోకి చూసేందుకు శివంగి కళ్లు వుండాలి - లేకపోతే కనపడదు.

ఒక పుల్ల ముక్క వెలిగించి, ఆ పుల్ల ముక్క తలకి పైగా పట్టుకు, దాని వెలుగులో, ఆ అలికిడి ఏమై వుంటుందా అని చూడ సాగింది సేవర్దు

"అమ్మాయ్, అంతా కులాసాగా వున్నారా?" అని అడిగాడు తండ్రి.

"బాగానే వున్నాం," అంది సేవర్దు.

అమ్మాయి చేతిలోని ఆ వెలిగే పుల్ల తీసుకుని, దాని కాంతిలో, భార్య ముఖం వంక ఒకసారి చూశాడు వర్తు. తల్లి పక్కబట్టలమీద రక్తపు మరకలు, తండ్రి చూడకుండా వుండాలని, సేవర్దు శతవిధాల కోరుకుంది. ప్రయాణ బడలికతో వున్న వర్తుకి అవేమీ కనిపించలేదు.

రక్తం పడ్డాక తల్లి మొగమెప్పుడూ తేటగా ఉండటం సేవర్దు కనిపెట్టింది. ఈ రాత్రి జేరీ ముఖం మహా ప్రశాంతంగా ఉంది; పలచబడ్డ చర్మంలో ఏదో తళుకుతో తన తల్లి ఒక మధురమూర్తిగా తోచింది సేవర్దుకి.

చేతిలో వున్న కర్రపుల్లని నిప్పులలో పడేసి, బుజంమీద నున్న మూటా వగైరా దింపి, ఒక పక్కగా చతికిలపడ్డాడు వర్తు.

"మన పక్కింటావిడ జేరీకి యివ్వమని కాసిని గోధుమలూ, రొట్టెలపిండీ పంపింది. ఇంకో సారికి మనమే పండించుకో వచ్చు నిక్కడ!" అన్నాడు వర్తు.

బ్రెడ్ ఎలా చేస్తారో సేవరుకి తెలియదు; కాని, నాన్న వెళ్లిన మర్నాడు అమ్మని వేధించి, ఆ కిటుకు తెలుసుకుంది.

ఏమీలేదు, నాన్నగాని ఒకవేళ రొట్టెల పిండి తీసుకువస్తే, తను అమ్మకి చేసిపెట్టగలగాలనే కోరికకొద్దీ అడిగింది. పిండి తడిపి, బ్రెడ్ చేసే పనిలో తను నిమగ్నమయే వేళకి, తండ్రి వళ్ళూపై తెలియకుండా నిద్దరపోతున్నాడు. రాత్రి రెండు సార్లు జేరీ దగ్గింది. అంత ఖంగు ఖంగున దగ్గుతున్నా కూడా వర్తుకి మెలకువ రాలేదు; రెండుసార్లూ సేవర్డే తల్లికి ఉపచారం చేసింది.

కళ్లు నులుపుకుంటూ, తెల్లారి లేచేవేళకి, కేబిన్ నిండా కమ్మటి వాసన అలుముకొని వుంది బ్రెడ్ చక్కగా తయారయింది.

"మొదటి ముక్క మీ అమ్మకి యియ్యి," అన్నాడు వర్తు.

బ్రెడ్ ముక్క జేరీ ముక్కుదగ్గిర వుంచి వాసన చూడమంటూ, "బ్రెడ్! బ్రెడ్!!" అన్నాడు వర్తు, జేరీతో.

ఆమె నీరసంగా తల తిప్పిందిగాని, తీసుకునే ప్రయత్నం చేయలేకపోయింది. ఆ బ్రెడ్ని, యింకొంచెం చిన్న ముక్కలుగా చేసి, పెదవులమధ్య వుంచాడు వర్తు.

"కొద్దిగా నములు. నమిలి మింగు," అని బుజ్జగిస్తూ చెప్పాడు భార్యకి.

తనకి అర్థమయినట్టుగా, ఆమె నోరు చిరునవ్వుతో విడివడింది. పెదవులూ, పళ్ళూ, నాలుకా, నోరూ—ఆమె ఆ బ్రెడ్ ముక్కని గ్రహించేందుకు చేస్తున్న ప్రయత్నాన్ని వర్తుకీ సేవర్డకీ చెప్పాయి. లోపలకి మింగబోయింది—కాని కంఠనాళందగ్గిర ఏదో

అడ్డుపడ్డట్టయింది. తెల్లటి బ్రెడ్, ఎర్రటి వైన్‌లో ముంచబడ్డ వస్తువులా వెనక్కి వచ్చేసింది.

జేరీ ఊపిరాడక ఉక్కిరిబిక్కిరవుతూంటే, వర్తూ సేవర్డూ ఆమెని కొంచెంగా లేవనెత్తారు. జేరీ కళ్ళ చుట్టూవున్న గుంటలు మరీ పెద్దవయాయి; ఈప్రపంచాన్ని చూడటానికి ఆమె నేత్రాలు నిరాకరించాయి. ఎంతో క్రోధంగావున్న ఆడఎలుగుబంటిని ఎదుర్కోగల వర్తు, ఈదృశ్యం చూడలేక, దిగజారిపోయాడు. స్త్రీలు ఒక్కరే యిటువంటి ఘట్టాల్ని ఎదుర్కోగలరు.

బ్రెడ్‌తోపాటు రక్తం కక్కుకున్నాక, జేరీ ముఖం మారిపోయింది. ఆమెకళ్లు వర్తువైపుగానే ఉన్నాయిగాని, అవి వర్తుని చూడటంలేదు. అతను గబగబా కేబిన్ తలుపు తెరుచుకొని బయటికివెళ్లిపోయాడు. అలా వెళ్లిపోయి ప్రయోజనంలేదని సేవర్డు చెబుదామనుకుంది. చూసినా చూడకపోయినా, మరణమనేది రావడం, ప్రాణమనేది పోవడం జరిగితీరాలి. పిల్లలందరూ దూరాన ఆడుకుంటున్నారు.

పచ్చటియిల్లు యిలాకూలిపోవలసిందేనా? అమ్మవెళ్లిపోయి, నాన్నపట్టనట్టు ప్రవర్తిస్తే, ఎవరో ఒకరు భారం వహించాలికదా! ఈ భావాలబరువు దాచుకోలేక సేవర్డు ఒక్కసారిగా కేకపెట్టింది: "రండర్రాపిల్లలూ - అమ్మచచ్చిపోతోంది."

# 6. అనంతరం

శవపేటిక తయారు చేసేందుకు మర్నాడల్లా కష్టపడ్డాడు వర్తు.

"ఎటువంటిదైతేనేం, అమ్మచూడదుగా ఆ పెట్టి!" అంది సేవర్డు.

శవపేటిక పూర్తిఅయ్యాక జేరీని అందులోవుంచి అందరూ తలో చెయ్యివేసి, తెల్లసిందూరవృక్షపు నీడలో తవ్వినగోతిలో పాతిపెట్టారు. చిన్నవాళ్లుఅయిన సూలీ, వియిట్ లుకూడా సాయంపట్టారు జేరీ కాళ్లు పెన్సిల్వేనియావైపు వుండేటట్టుగా శవపేటికని భూస్థాపితం చేశారు.

వర్తు ఆ రాత్రి సరిగ్గా నిద్రపోలేకపోయాడు. నిప్పుల పొయ్యిదగ్గిర దుప్పటికప్పుకు కూర్చున్నాడు. మర్నాడు పొద్దుట టిఫిన్ తిని, తుపాకీ బుజానవేసుకు, అడవులలోకి బయలు దేరాడు.

"నేను తొందరలోనే తిరిగివస్తాను - నువ్వు ఒక్కతెవ్వూ చూసుకోగలవ్వుకదూ?" అన్నాడు సేవర్డుతో.

"ఓ - చూసుకోగలను. దానిదేముంది!" అంది సేవర్డు.

ఆమెకి మనసులో తెలుసు - తండ్రి అక్కడనుంచి పారిపోతున్నాడని! కాని, అనుకుని ఏంలాభం? భగవంతుడు మొగవాణ్ణి ఆవిధంగా సృష్టించాడు. యింట్లో పరిస్థితులు బాగుండకపోతే, తుపాకీచేతబుచ్చుకొని, అడవులలోకి పారిపోవచ్చు మొగవాడు! కాని, ఆడది అనగానే, యింటినీ వంటకుంపటినీ కనిపెట్టుకొని వుండకతప్పదు.

"నేను మొగవాణ్ణికాలేక పోయానే, అని ఏడ్చి ఏమిలాభం? భగవంతుడు నన్ను ఆడదానిగా పుట్టించాడు. అంతే, అది వప్పుకుతీరాలి," అని సేవర్డు సరిపెట్టుకుంది.

మనసు మరీ దిగులుగా ఉన్నప్పుడు, ఆ దిగులు మర్చిపోయేందుకు పని కల్పించుకునేది సేవర్డు. పిల్లలుకూడా నెమ్మది నెమ్మదిగా తల్లిని మర్చిపోవడం మొదలెట్టారు. కాని, దారితప్పిపోయినవాళ్లలా, ఏదో పారేసుకున్నవాళ్లలా వెర్రిగా తిరుగుతూండేవారు. తల్లి చావుచూసి, వాళ్లు అంతపెద్దగా ఏడవలేదుగాని, తరవాత్తరవాత వాళ్లకేదో వెలితి తోచనారంభించింది. వర్తు ఒక్కొక్కప్పుడు, రోజుల కొద్దీ కేబిన్ వైపుకి రాకుండానే, గడిపేస్తూండేవాడు.

నాన్న వెళ్లి రెండురోజులయింది. నాన్నకోసం పిల్లలందరూ ఎదురుచూస్తున్నారు. జెన్నీ కేబిన్ తలుపుతెరిచి, బయటికి చూసింది. అడవి అంతా అంధకార బంధురం. ఆ చీకటిలో ఆ నిశ్శబ్దతలో ఆమె ఒకపాట అందుకుంది. "నేను కన్నెగా చని

పోవడం తప్పనిసరిఅయితే, నా శవపేటిక నన్ను చూడనీయండి. నేను పెళ్ళిచేసుకు సౌభాగ్యవతిని అవవలసివుంటే, ఒకచిన్నపిట్ట కమ్మటిపాట వినసీయండి."

జెన్నీ ఆ విషాదగీతం ఆలాపిస్తూవుండగా, పిల్లలందరూ చెవులు పెద్దవి చేసుకువిన్నారు. పాట ఆగిపోవడముతో నిశ్శబ్దం మళ్ళీ ఆవరించింది. ఆ నిశ్శబ్దానికి సౌందర్యమాపాదించేందుకు, నీళ్ల గలగల చెట్లాకులతో సంభాషిస్తోంది. మధ్యమధ్య ఏదో గొడ్డలితో, చెట్టుమొదలుమీద వ్రేటుపడుతున్నట్టుగా, వినిపించ సాగింది. జెన్నీ హడలిపోయి కేబిన్‌లోపలికి వచ్చేసింది.

"అది భయపడవలసిందేమీకాదు - వడ్రంగిపిట్ట; కాదక్కయ్యా?" అంటూ సూలీ, జెన్నీని ఓదారుస్తూ, సేవర్డుని అడిగింది.

"వడ్రంగిపిట్టలాలేదు - గొడ్డలివ్రేటులాగానే ఉంది," అన్నాడు పియిట్.

ఒకరోజు ప్రయాణంచేస్తేగాని, ఆ చుట్టుపక్కల ఎక్కడా 'గొడ్డలి' అనే మాట వినిపించదు.

"ఎవరైనా రెడ్ యిండియన్ తన పడవకి కావలసిన చెక్క నరుక్కుంటున్నాడేమో!" అంది సేవర్డు. కాని మనసులో ఆమెకి, అది కాదేమో అని, అనుమానంగా ఉంది. పిల్లలని సమాధానపరిచి, ఆ పూటకి నిద్రపోగొట్టింది.

సేవర్డు కళ్ళు తెరిచేవేళకి పూర్తిగా వెలుగువచ్చింది. జెన్నీ ఆమెని కుదుపుతూ, "విను, అక్కయ్యా, విను" అంది నెమ్మదిగా.

సేవర్థు తలపై కెత్తి విన్నది. దూరంగా ఏదో గొడ్డలి చప్పుడే! పొద్దుటవేళంతా వినిపిస్తూవేవుంటిగాని, మధ్యాహ్నం మళ్లీ వినిపించలేదు. సాయంత్రం మళ్లీ వినిపించసాగింది. మర్నాడు పొద్దుటికి యింకా ఎక్కువగా వినిపించసాగింది. ఆ పూట కట్టె పుల్లలు నరుక్కుంటున్నప్పుడు సేవర్థు అనుకుంది: "ఇదేం బాగా లేదు - ఏమిటోగాని!"

పిల్లలూ, ఆమె, పది అడుగులు ముందుకివేశారు. శబ్దం ఎదురునుంచిగాక పక్కలనుంచి రావడం మొదలుపెట్టింది. అందరూ యింకొంచెం ముందుకిసాగారు. కొండగుట్ట దిగి కిందికి వెళ్లేటప్పటికి, ఏదో అడవిమృగం చెట్టుమ్రానుని పట్టుకున్నట్టు వుంది. నిజానికి అది అడవిమృగంకాదు - యినపజంతువు. ఆ మర గొడ్డలి పక్కగా వియిట్ వయసుగల కుర్రవాడు నిలబడ్డాడు.

వియిట్ ఆ కుర్రవాడిని ఉద్దేశిస్తూ చెయ్యి ఊపాడు. ఆ కుర్రవాడు చటుక్కున వెనక్కి తప్పుకున్నాడు. అతనిస్థానంలో తుపాకీ పుచ్చుకు ఒక పెద్దతను నిలబడిఉన్నాడు. తుపాకీ చూసీ చూడగానే పిల్లలందరూ చెల్లాచెదురుగాపారిపోయారు. కొంచెం చీకాకుగానూ, నిశ్చలంగానూ సేవర్థు ఒకర్తే అక్కడ నుంచుంది.

"తుపాకీ ఎందుకు ఎత్తుతావ్? మేము భయపడవలసిన వాళ్లమా? ఇరుగూ పొరుగునిచూసి భయపడటం దేనికి?"

# 7. కన్నె

అయితే యిక్కడ, ఈ అడవిలో తెల్లవాళ్లు ఉంటున్నారన్నమాట ; అమ్మ బ్రతికివుంటే ఎంతసంతోషించేదో కదా - అనుకుంది సేవర్డు.

చిన్నపిల్లలు గబగబా అర్థం పర్థం లేనివి, ఏమిటేమిటో మాట్లాడేస్తున్నారు.

"తమ్ముడూ, ఆ అబ్బాయిని పల్కరించు," అంది సేవర్డు వియిట్‌తో.

ఆ అబ్బాయిని వెక్కిరించడం తప్ప, మరొకవిధంగా పల్కరించలేకపోయాడు వియిట్. తను ఆ అబ్బాయితండ్రితో ఈ మాటా ఆ మాటా మాట్లాడుదామనుకుంది గాని, ఆడ మనిషిని చూడగానే అవతలతను ముణుచుకుపోయాడు. ఈ పిల్లలూ వాళ్లూ ఒకరినొకరు ఆశ్చర్యంతో చూసుకుంటూ, పెదవి కదపకుండా నుంచున్నారు కొంచెంసేపు.

అక్కడకూడా ఆడవాళ్లువుంటే బాగుంటుంది-అనుకుంది సేవర్డు యింటికివస్తూ. స్త్రీ అనేదివుంటే తమలాటివారితో

ఈ కబురూ ఆ కబురూ చెప్పుకునేందుకు ఎంతగానో సంతోషి స్తుంది. ఏమైనా ఈ చీకటి అడవులలో మరికొందరు మానవులు వున్నారనే భావన, మనసుకి తృప్తినిస్తుంది.

ఇంట్లోకి రాకపూర్వమే, వర్తు ఈ కొత్తమనుషులగురించి, పిల్లలద్వారా విన్నాడు. భోజనమయ్యాక సేవర్డు వంక తిరిగి అడి గాడు. "అతనికి ఆడవాళ్లు లేరా ?"

"నేను అడగలేదు," అంది సేవర్డు.

కుర్చీపీట దూరంగా పెట్టుతున్నాడు, సేవర్డు తండ్రిముఖం లోకిచూసింది. తల్లికి మల్లేనే సేవర్డుకూడా, తండ్రిమనోభావాలు యిట్టే పసిగట్టడం నేర్చుకుంది.

మర్నాడు, ఆ పొరుగుమనిషి, వాళ్లయింటికివచ్చాడు. బయటనున్న కర్రదుంగమీద స్తిమితంగాకూచుని, తండ్రీ అతనూ తెగకబుర్లు చెప్పుకుంటున్నారు. ఆ కొత్తతనికి వాళ్ల కేబిన్‌చూడగా మతిపోయింది.

అతనివెంటవచ్చిన కుర్రవాడు, దారితప్పిపోయిన గొర్రె పిల్లలా నిలబడ్డాడు. ఆడదిక్కులేని ఈ కొత్తవాళ్లకి, ఈ పూటకి కడుపునిండా భోజనంపెట్టాలి - అనుకుంది సేవర్డు. వర్తునీ, వియిట్‌నీ తను కనిపెట్టినట్టుగా, వాళ్లని కనిపెట్టేవాళ్లెవరూ లేరుగా !

భోజనాలయ్యాక పెద్దవాళ్లిద్దరూ, బయటికివెళ్లి కూర్చుని, చుట్టలు ముట్టించారు. తాము ఎక్కడెక్కడనుంచివచ్చినదీ, ఈ అడవిలో తాము ఎలానెగ్గుకువస్తున్నదీ, ఒకరికొకరు చెప్పు

కున్నారు. కొత్తతని పేరు మేతియాస్ కాటిల్. 'ఒక గుర్రం ఒక ఆవూ ఉన్నవారు ఎంతదర్జా వొలకబోస్తారో,' ఆ విధంగా మాట్లాడేవాడు మేతియాస్. అతనినల్లటి నేత్రాలు, తననే పరిశీలిస్తున్నట్టుగా ఉండేది సేవర్డుకి.

చేతిలోవున్న కత్తిమొనతో సేవర్డుని చూపిస్తూ "ఆపిల్లకి పెళ్లి అయిందా?" అని అడిగాడు మేతియాస్, వర్తుని. ఆకత్తి తన గుండెలలోనుంచి దూసుకుపోతున్నట్టుగా తోచింది సేవర్డుకి.

పెద్దకూతురువంక వెర్రిచూపులు ప్రసరింపజేసేడు వర్తు. ఈ ఉత్తర ప్రాంతంలో మొగవాళ్లు మహా కరువు. అందులో ఒక ఎద్దు, ఒక గుర్రం, ఒక ఆవు కలిగిన ఆసామీ తనకూతుర్ని పెళ్లాడుతానని అడగడం నిజంగా తన అదృష్టమే!

"పెళ్లికాలేదు," అంటూ తల పంకించాడు వర్తు.

"ఫలానివారికని నియామక మేమైనా జరిగిందా?"

"నాకు తెలిసినంతలో అటువంటిదేమీ జరుగలేదు."

కొద్దినిముషాలు గడిచాక మేతియాస్ అన్నాడు. "మేతియాస్, నీకు జత ఎద్దులుకావాలా? అక్కర్లేదు - ఒకటివుంది, చాలు. మేతియాస్, నీకు గుర్రమూ గుర్రబ్బండీకావాలా? అక్కర్లేదు - గుర్రం ఒకటివుంది, చాలు; బండీ నడిచేందుకు యిక్కడ రోడ్లులేవు; అంచేత, బండీ అక్కర్లేదు. మేతియాస్, నీకు పాడి ఆవుకావాలా? - అక్కర్లేదు, పుష్కలంగా మాంసం దొరుకుతోంది. అయితే, మేతియాస్, నీకేంకావాలి? ఇల్లు కని పెట్టుకునివుండి, చేదోడు వాదోడుగా వుండగలభార్యకావాలి- అని నాకు నేను చెప్పుకున్నాను"

"వింటున్నావా, సేవర్డు?" అన్నాడు వర్తు, కూతురిని ఉద్దేశిస్తూ.

"వినిపిస్తూనేవుంది," అంది ఆమె నెమ్మదిగా.

"అతని మాటలకేమీ జవాబు చెప్పవ్?"

"జవాబుచెప్పేందుకు, అతనిగురించి నాకింకా ఏమీ తెలియనే తెలియదుగా!"

తండ్రికోరేజవాబు, తను చెప్పదలుచుకోలేదు. అతని ఆలోచనలు ఏవిధంగా ఉంటాయో, ఆమెకి తెలియక కాదు. తమ తల్లి చనిపోయిందికదా! చెల్లెళ్ళనీ తమ్ముడినీ చూసుకోవలసిన భారం తనది; తను యిప్పుడు పెళ్లిచేసుకుంటే, పరిస్థితులు తారుమారవుతాయి. పెద్దకూతురూ అల్లుడూ ఉన్నారుకదా అని, తండ్రి పూర్తిగా యింటిమొహం చూడటమే మానెయ్యవచ్చు. తల్లితోబాటు తండ్రికికూడా దూరమైపోతారుపిల్లలు!

"మీరు 'యుగిహీని' ప్రాంతాలకి వెళ్తున్నానని అన్నారుకదూ! అక్కడికి వెళ్లినప్పుడు, ఒకమంచి అమ్మాయినిచూసుకు, పెళ్లి చేసుకురాకూడదూ?" అంది సేవర్డు, మేటియాస్‌తో.

"మాగీ అనే అమ్మాయి నాకుతెలుసు. ఆ అమ్మాయికి నేనంటే చాలాయిష్టం కూడాను."

"అయితే ఆ అమ్మాయిని పెళ్లిచేసుకుని, తీసుకురండి. దగ్గరలో ఆడవాళ్లువుంటే నాకూ కాలక్షేపంగా ఉంటుంది," అంది సేవర్డు.

మేతియాస్ ఆమెవంక చూశాడు; ఆమె అంతర్యం ఎంతకీ అతనికి అర్థంకాలేదు. తనలాటివాడికి తగదు కాబోలు ఆ అమ్మాయి - అనిభావించాడు. వర్షం వల్చబడ్డాక, మేతియాస్, అతని వెంటవచ్చిన అబ్బాయీ మిత్రగృహంనుంచి బయటికొచ్చారు.

వారు వీధిగుమ్మందాటారో లేదో వర్తు అన్నాడు పెద్ద కూతురితో: "ఏమొచ్చింది నీకు - అలా మాట్లాడావ్!"

"ఏమీ రాలేదు సరిగ్గానే చెప్పాను."

"గుమ్మంముందుకివచ్చిన లక్ష్మిని కాలదన్నావ్. మళ్లా యిటువంటి అవకాశం రాకపోవచ్చు."

"ఇతను మొదటివాడేకదా! ఇతనే చివరివాడెందుకవుతాడు?— అవడు," అంది సేవర్డు బింకంగా.

గుబురుగా పెరిగిన కనుబొమలలోనుంచి మరీచిక్కగా చూశాడు వర్తు, కూతురివంక.

తండ్రి తనని గౌరవించగలుగుతున్నాడని తెలిసింది సేవర్డుకి. ఆక్షణాన తను బాలికకాదు. మంచిచెడ్డలూ బరువుబాధ్యతలూ తెలిసినస్త్రీ. స్త్రీ స్త్రీగానే, స్త్రీధర్మాన్ని అనుసరించి బ్రతకాలి.

# 8. సెటిల్ మెంటు

మరుసటి వసంతకాలంలో వర్త్ సేవర్డుతో అన్నాడు - ఈ వాయువ్య ప్రాంతంలోని పరిస్థితులు చెడిపోతున్నాయని. కొన్నాళ్ళక్రితం యిది సర్వసమృద్ధి గల ప్రదేశం - ఈనాడు పాడై పోతోంది. ఇప్పటికీ పిట్టలు దొరుకుతున్నాయి, రెడ్ ఇండియనుల అల్లరులేమీలేవు, - కాని, ఓహియోనది దాటి అవతలనైపు నుంచి వచ్చే మనుషుల రద్దీ ఎక్కువవుతోంది. చాలా మంది స్త్రీ పురుషులు నెమ్మది నెమ్మదిగా ఈ అడవుల వైపుకి వచ్చి నివాసం ఏర్పరుచుకుంటున్నారు. మొట్టమొదట కాటిల్స్ వచ్చారు; ఆపైన మాక్ విటర్స్ వచ్చారు; ఆ తర్వాత ఒక వర్తకుడూ అతని బండ నౌకరూ మరికొందరూ వచ్చారు. వర్తకుడు రావడంతో సరుకుల గిరాకీ పెరిగింది; జంతు చర్మాలు మారకం వస్తువు లయాయి.

వర్తకుని వ్యాపార విషయాల గురించి విన్న వియాట్, ఎలాగో ఒక విధంగా తమ యింట్లోని జంతుచర్మాలు రహస్యంగా పట్టుకెళ్లి అతనికి యిచ్చి, ఒక శ్రేష్ఠమయిన కత్తి సంపాయించాలనుకున్నాడు. చేతిలో కత్తి వుండటం ఎంత మంచిది! దుష్టుల్ని

దుష్ట జంతువుల్నీ దూరంగా వుంచవచ్చు. మంచిసమయం కోసం మూడురోజులపాటు కనిపెట్టుకు వున్నాడు వియిటక్. నాలుగో రోజు వుదయం తండ్రి అడవులలోకి వెళ్ళడంతో అదను దొరికింది కుర్రవాడికి.

పొదలమీద ఎండేసిన జంతు చర్మాలని వెనక్కి తోసెయ్యడం చూసి, "ఏం చేస్తున్నావ్?" అని అడిగింది అక్కగారు.

ఏమీ లేదన్నాడు తమ్ముడు.

సేవర్డ్ కనుగప్పి, జంతుచర్మాలు పుచ్చుకుని, అడవులలోకి పరిగెట్టాడు వియిటక్. వర్తకుని కొట్టు ఎక్కడో అతనికి తెలియదు. కాని తెలుసుకోలేక పోతానా అని బయలుదేరాడు. దారిలో బండ నౌకరూ, మరొక అబ్బాయీ కనిపించారు వియిటక్‌కి. కొట్టేసిన చెట్ల మొదళ్ళని ఆనవాలుగా చూసుకుంటూ, వర్తకుని కొట్టు చేరుకున్నాడు వియిటక్.

కొట్టుకి లోపల పొగ. బయట ఎర్రతోలుమీద స్తిమితంగా కూచుని వున్నాడు వర్తకుడు. అతనే కాబోలు జార్జిరోబక్. చూపులకి మనిషి గుంటనక్కలా ఉన్నాడు. చాలా మంది రెడ్ ఇండియనులు అతనితో బేరాలు ఆడుతున్నారు. వియిటక్ తన వంతుకోసం నిలబడి వున్నాడు.

వియిటక్ వంతు వచ్చేవేళకి సాయంకాలమయింది. కొట్టు లోపల రంగు రంగుల వస్తువులు, చక్కటి వస్తువులు ఉన్నాయి. ఆకుపచ్చ కంబళ్ళు, ఎర్రకంబళ్ళు, కర్రబకెట్లు, విస్కీపీపాలు -

అంతా గుమ్మగా ఉంది. ఆ వస్తువులు చూస్తూంటే, కుర్రవాని దేహంలోని రక్తం పందెపు గుర్రంలా దౌడుతీసించి. రోబర్ యితని దగ్గిరున్న జంతుచర్మాలు తీసుకుని, వాటిని పరిశీలించడం అనవసరమన్నట్టుగా లోపలికి గిరవాటువేసి, ఒక పిడికత్తి కుర్ర వానికి యిచ్చాడు.

ఇన్నియిస్తే, ఒక్క కత్తేనా - వియిట్ కి అనిపించింది. కాని, ఆ పిడి చేతబుచ్చుకు, కత్తిని యిటు అటు తిప్పి చూసే టప్పటికి, పోనీ యిదయినా లభించింది కదా అని తృప్తి కలిగింది. అప్పటి కప్పుడే దీపాలు పెట్టారు. ఆ అడవి ఒక పెద్ద జీభూతంలా ఉంది. చేతిలో కత్తివుందికదా అని ధైర్యం చెప్పుకుంటూ, యింటి వైపుగా నడిచాడు వియిట్.

పది గజాలు నడిచాడో లేదో బండ నౌకరూ, యిందాక కనిపించిన అబ్బాయీ ఒక్కసారిగా వియిట్ మీద పడబోయారు. "కాసుకోండి_పొడిచేస్తాను" అన్నాడు వియిట్.

"పొడుస్తావూ, నీ కత్తి లాక్కుంటాము చూడు," అంటూ బండనౌకరు ముందుకి దూకాడు.

వియట్ ధైర్యంగా నిలబడ్డాడు.

"నామీద చెయ్యిపడిందీ, పొడిచేశానన్నమాటే!" అని, ఆయుధమిచ్చే నూతన ధైర్యంతో అన్నాడా కుర్రవాడు.

ఎదుటివాళ్లిద్దరూ జంకారు.

విజయోత్సాహంతో వియిట్ ముందుకి నడుచుకుంటూ పోయాడు.

వర్తకుని కొట్టు దూరమవుతున్న కొద్దీ చీకటి ఎక్కువవు తోంది. తమ కేబిన్ యింత దూరముందని, ఏనాడూ అనిపించ లేదు. అడవిలో దూరంగా తోడేళ్ల అరుపులు వినిపించాయి. ఏదో ఆడ జంతువు బిగ్గరగా ఏడుస్తోంది. శబ్దాలు దగ్గిర పడు తున్నకొద్దీ పొదల చాటుకు వెళ్లి దాక్కుంటూండే వాడు. చేతిలో ఈ కత్తి వుందిగనకగాని లేకపోతే ఏమైపోదును - అని అనుకుంటూండేవాడు క్షణ క్షణానికీ!

ఎంత నడిచినా బాటకి అంతు కనపడటం లేదు. మట్టిలో దారి మరిచిపోయిన మట్టి పాము స్థితివలె ఉంది. ఒక సారి ఏదో దీపం మిణుకు మిణుకు మంటున్నట్టు అగుపించింది - మళ్లీ చూస్తే మాయమయింది. అలా నడవగా నడవగా చిరపరిచితమైన ప్రదే శాలు కనిపించడంతో అతనికి ప్రాణం లేచివచ్చింది. ఆఖరికి కేబిన్ చేరుకున్నాడు. కేబిన్‌లో అందరూ మెలకువగా ఉన్నారు; తమ్ముడు ఈ రాత్రివేళ అడవులలో ఎక్కడికి తప్పిపోయాడో అని ఆదుర్దాగా ఉన్నారు అందరూ.

"ఎక్కడికి కెళ్ళావ్?" అంది గుమ్మందగ్గిర నిలబడ్డ జెన్నీ.

"జంతు చర్మాలు యిచ్చి, కత్తి కొనుక్కునేందుకు, వర్తకుని కొట్టుదగ్గిరికి వెళ్ళాను," అని కత్తి చూపించాడు వియిట్.

ఆశ్చర్యం, జెన్నీ ఆ కత్తి తమ చేతుల్లోకి తీసుకు చూడ బోయారు కాని వియిట్, తను కొన్న వస్తువుని, మొట్ట మొదట పెవర్లుకి యిచ్చాడు.

"ఒక్క కత్తేనా వచ్చింది?" అని జాలిగా అడిగింది ఆశ్చా.

తను పరిశీలించిన మీదట సేవర్డు, ఆ కత్తిని జెస్సీకి యిచ్చింది. ఇస్తూ వియిట్‌తో అంది: "ఈ సారి వర్తకుని దగ్గిరికి వెళ్ళేటప్పుడు మీ నాన్నతో వెళ్ళు - అంతేగాని నువ్వు ఒక్కడివీ వెళ్లకు. నిన్ను బోల్తా కొట్టిస్తారు."

"నన్ను ఎవరూ బోల్తా కొట్టించలేరు," అన్నాడు వియిట్ పురుష గర్వంతో.

"ఈసారి వెళ్తున్నప్పుడు నాకు చెప్పి మరీవెళ్ళు - ఏమైపోయావో అని అర్ధరాత్రిదాకా పడగాపులుపడి కూచోలేము," అని సేవర్డు కఠిన వాక్కులతో అంది.

సేవర్డు ఆ తర్వాత పిల్లలందరినీ పక్కలమీదికి వెళ్లి పడుకోమంది. వియిట్ యింటికి వచ్చినందుకు ఆమెకి ఎంతో హాయి అనిపించింది. అంతగా అయితే, తానే ఆ వర్తకుని కొట్టు దగ్గిరికి వెళ్లేది! కాని, ఆడవాళ్ళు మొగవాళ్ళు వుండే చోటుకి రావడం ఆ వర్తకునికి హితవుగా వుండకపోవచ్చు. ఏమైనా, తమ చుట్టు పట్ల నరసంచారమంటూ ఏర్పడుతోంది. అది సంతోషించతగ్గ విషయం. ఒక చిన్న సెటిల్‌మెంటు అంటూ ఏర్పడుతోంది. అమ్మ బతికి వుంటే ఎంత ఆనందించేదో!!

# 9. వయసుతో మాధుర్యం

జెన్నీ అందమైన బొమ్మలా తయారవుతోంది.

జెన్నీ యిక చిన్నపిల్లలలో జమ కాదు; చిన్న పిల్లలతో కలవ లేక ఆమె దూరంగా జరుగుతోంది. కేబిన్ బెంచీ పై కాలి మీద కాలు వేసుకు కూర్చుని, కాళ్ళు వూపుతూ విషాద భరిత మైన మధురగేయాలు తనలో తను పాడుకుంటూ ఉండేది.

ఇవ్వాళ, తన కొచ్చిన పాటలన్నీ పాడేసింది జెన్నీ. "ఎగిరి పోవడం" పాట రెండుసార్లు పాడింది. ఆ పాట అంటే ఆమెకి చాలా యిష్టం.

"వైలెట్ పువ్వులు ఎగురుతున్నాయి; పచ్చటి ఆకులు ఎగురు తున్నాయి; నీలం పిట్టలు ఎగురుతున్నాయి - వాటితో బాటు నా మదిలో కోరికలు......"

"నీ మదిలో కోరిక తీరుతుందిలే...ఆ ముద్దావతారం వచ్చాడు," అంది ఆశ్నా, చిన్నక్కని పరిహాసమాడుతూ.

జెన్నీ ఒక్కసారి బయటికిచూసి, చటుక్కున లోపలికివెళ్ళి దాక్కుంది.

జేక్ బెంచీ, మొద్దావతారమూ కేబిన్‌లోకి వచ్చారు. లోపల దాక్కున్న జెన్నీకి వాళ్ళ అడుగుల శబ్దం వినిపిస్తూనే వుంది. ఈ కేబిన్ తన స్వంతమైనట్టుగా నడుచుకుంటూ లోపలికి వచ్చాడు జేక్.

లోపలి గదిలో యిరుక్కుపోయినందుకు జెన్నీకి కష్టంగానే ఉంది. తలుపుసందులో నుంచి ఒకసారి, అక్క ఏమిచేస్తోందో నని చూసింది. సేవర్డు వంటపనిలో ఉంది; జేక్ తన ప్రగల్భాలు చెబుతున్నాడు.

జేక్ చాలా వుషారుగా ఉన్నాడు. గొప్పలు చెప్పుకోవడంలో తనని తాను మర్చిపోయి, నోట్లోవున్న పొగాకు, నిప్పుల పొయ్యిలోకి వుమ్మేశాడు. జెన్నీకి సేవర్డు ముఖం ఎర్రపడటం కనిపించింది; ముఖము ఎర్రపడిందే గాని, సేవర్డ్ నోటినుంచి పరుష వాక్యం వెలువడలేదు.

మొద్దావతారం సేవర్డుని, జెన్నీ ఎక్కడవుందని, అడిగాడు.

"బయట ఎక్కడో ఆ చెట్లక్రింద వుండి వుంటుంది," అంది సేవర్డు.

"అక్కడలేదు."

"ఇంకొంచెం దూరంవెళ్ళి వుంటుంది. అక్కడే ఏ పుట్ట కొమ్మమీదనో, ఏ చెట్టుక్రిందనో వుండివుంటుంది. బాగా వెతుకు," అంది సేవర్డు.

జెన్నీకి ఆ క్షణాన అక్కగారిమీద ఎంతో ప్రేమ పుట్టుకొచ్చింది. అసలు, సేవర్డు తత్వమే అంత! నమ్మిన వారిని నీట ముంచదు.

జేక్ బెంచ్ తన అక్కకి తగడు. తన అక్క చాలా మంచిది. కాని, యిటువంటి ప్రదేశంలో యింకేమి సంబంధాలు దొరుకుతాయి? ఇష్టమున్నా లేకున్నా, జేక్‌ని కట్టుకుని కాపరం చెయ్యాలి.

కాసేపయేటప్పటికి మొద్దావతారం మళ్ళీ ప్రత్యక్షమయాడు.

“నేవర్దు, జెన్నీ ఎక్కడా కనిపించడం లేదు.”

ఆ మాటలకి జేక్ బెంచ్ నవ్విన వికృతపునవ్వు జెన్నీకి అసహ్యమేసింది.

“దూరంగా ఆ చెట్ల చాటున ఎక్కడో నీకోసం కనిపెట్టుకుని వుండివుంటుంది,” అన్నాడు జేక్ బెంచ్.

మొద్దావతారం గబగబా పరిగెత్తడం చూసిన మీదట, జెన్నీ తను దాక్కున్న స్థలంనుంచి బయటికొచ్చింది. వగురుస్తూ, ఆశ్చర్యంగా తనవంక చూస్తున్న మొద్దావతారం, జెన్నీకి కనిపించాడు. కేబిన్ తలుపు తెరుచుకుని వెలుపలకి దౌడుతీసింది ఆ అమ్మాయి.

“జెన్నీ, జెన్నీ!!” అని అరుస్తూ వెంటపడ్డాడు ఆ మొద్దావతారం. కాని, జెన్నీ ఆగలేదు. తనని ఒక మొగకుర్రవాడు వెంబడిస్తున్నాడని ఆమెకి తెలుసు. బుజాలమీదుగా ఒకటి రెండు సార్లు వెనక్కితిరిగి చూసి, యింకా కొంచెం వేగంగా పరుగు అందుకుంది.

సన్నటికాళ్ళు అవడంవల్ల ఎంత దూరం పరిగెత్తినా, ఆమెకి అలసట అనే అనిపించలేదు. కాని, కొంచెంసేపు నడుద్దాం

కదా అని, పరుగు ఆపి, నడక మొదలెట్టింది. ఈ సన్నటి పిల్లకి ఫుజ్జీగా, ఆ మొద్దావతారం, పరిగెత్తలేకపోయాడు. అదీగాక, ఆమె ఒక లేడిపిల్ల. అందంగా వుండే లేళ్ళని వేటాడినట్టే, పురుషులు స్త్రీలని వేటాడబోతారు. కాని, లేళ్ళు చక్కగా తప్పించుకో గలవని ఈ పురుషులకి తెలియదు. చచ్చినా ఆ మొద్దావతారానికి ఈ బంగారు లేడి కనిపించదు. అన్ని లేళ్ళకీ కొన్ని రహస్య స్థలాలు వుంటాయి; ఆ రహస్య స్థలాలు వేటగాని కంట పడవు - ఏనాటికీ పడవు. జెన్నీ వలయాకారంగా ఒక చుట్టుతిరిగి, మొద్దావతారాన్ని దారి తప్పించి, తను రహస్య స్థలంలోకి పోయి దాక్కుంది. ఆ రహస్యస్థలం ఎవరికీ తెలియదు; ఎవరూ రాలేరు.

పాదాలకి తగులుతున్న పొదలుదాటి, దేవదారువృక్షాల నీడ చిక్కగావున్న చోటుదాటి, నదిగట్టునవున్న యిసుకలో, బంగారు కిరణాలపక్కన, వెండి ప్రవాహమూ అనేప్రదేశంలో విశ్రమించింది జెన్నీ. ఆ యిసుకలో ఆమె ఒక వనదేవత,- ప్రకృతికన్య.

ఎవరైనా తనని యింకా వెంటాడుతున్నారా అని పరిశీలనగావింది. అటువంటిదేమీ లేదు. ఈ మనోహరమందిరానికి తను మహారాణి. ఆమెదేహంలోనిరక్తం వెచ్చగా ప్రవహిస్తోంది. ఒంటిమీదవున్న బట్టలీసేసి, ఆయిసుకలో వెల్లకిలాపడుకుంది. అతిపురాతనమైన గోధుమరంగు దుప్పటిమీద పడుకుంది. సుందర ప్రకృతి ఆమెకళ్ళముందు నాట్యమాడుతోంది. ఈ చైతన్య జగత్తులో తను ఒక చైతన్యమూర్తి. తన జన్మ సార్థకంచేసే సుంద

రాకారుడు తనని కలుసుకుంటాడు. అతను తండ్రికి మల్లే తుపాకీ బుజాన మోసుకుపోయే మనిషైవుండడు; అందమైనటోపీ ధరించే గవర్నమెంటు ఆఫీసరై ఉంటాడు. అతనికి బంగారుమెడల్స్ వుంటాయి. తనని ఈ అడవుల్లోనుంచి తీసుకవెళ్లి, సెటిల్ మెంటులో కాపరం పెడతాడు. తనుకూడా అక్కడిస్త్రీలందరికి మల్లే, అందమైనగౌనులు వేసుకోగలుగుతుంది. ఆదివారాలప్పుడు అందరూ చర్చికివెళ్లవచ్చు. ఈ అడవిలోనుంచి నాగరికతలోకి తీసుకువెళ్లగల, సుందరాకారునిగురించి కలలుకంటూ, పొద్దు గ్రుంకేదాకా గడిపేసింది జెన్నీ.

కేబిన్ పరిసరాలకి వచ్చేవేళకి చీకటి చీకటి పడుతోంది. తలుపు తెరిచివుండటంవల్ల మొద్దావతారం మిగతాపిల్లలతో ఆడుకుంటూండటం జెన్నీకి బయటనుంచే కనిపించింది. సేవర్డూ, జేక్ మాత్రం లోపలలేరు. యింకొంచెం సేపటికి వారిద్దరూ షికారు నుంచిరావడం జెన్నీకి కనిపించింది. సేవర్డు జేక్ తో షికారుకివెళ్లడం జెన్నీకి ఎందుకనో నచ్చలేదు. జేక్, మొద్దావతారం యిద్దరూ వెళ్లిపోయాక, జెన్నీ కేబిన్ లోకివచ్చింది - ఆడనక్కలా సిగ్గు పడుతూ లోపలికివచ్చింది.

అక్కా తనూ ఒకే పక్కమీాదపడుకుంటున్నా, ఆరాత్రి తను అక్కకి దూరంగా జరిగిపడుకుంది. ఇటూ అటూ కదలుతూ నిద్రపట్టక సతమతమవుతున్న జెన్నీని. "ఏం, వొంట్లోబాగాలేదు?" అని అడిగింది సేవర్డు.

"నాకు నిద్దరరాకపోవడానికి కారణం నీకు తెలును. ఆ జేక్ టెంచ్ వున్నాడే వాడు.........."

సేవర్డు, నవ్వు ఆపుకుంటున్న సంగతి, జెన్నీ గ్రహించింది.

"జేక్ టెంచ్ గురించి బాధపడవలసినదేముంది?" అని అడిగింది సేవర్డు.

"నువ్వు అతన్ని పెళ్లి చేసుకుందా మనుకుంటున్నావుగా?"

సేవర్డు కంఠం కఠినతరమయింది.

"నేనా? అతనినా? పొయ్యిలో వుమ్మేసేవాడిని పెళ్లి జేసుకుంటానా?..." అంది సేవర్డు.

# 10. షమక్‌లో కేబిన్

కోవెన్ హావెన్‌గారి ఆవుల్ని కాయడమనే ఉద్యోగం దొరికింది వియిట్, సూలీలకి. ఈ గొడ్లకి పసరికదొరికే చోటికి కొద్దిగా పైగా ఒక చిన్న కేబిన్ ఉంది. ఆ కేబిన్ పరిసరాలు నానా అసహ్యంగానూ వుండటంతో, అక్కడ మనుషులు నివసిస్తున్నారనే విషయం నమ్మలేనట్టుగా ఉండేది.

"అది లూయియా వుండేచోటు. సైమన్‌తో వుండేవాడే, ఆ లూయియావుండేచోటు అది" అని అన్నాడువర్తు ఒకరోజున.

పిల్లలందరూ తండ్రివంక నిశ్చేష్టులై చూశారు.

ఆ చుట్టుపట్లనున్న పిల్లలాందరికీ లూయియాపేరు తెలిసినదే! లూయియాని చిన్నప్పుడు రెడ్ యిండియనులు ఎత్తుకుపోయారట. వాళ్ళమధ్య పెరిగి, వాళ్ళగుణాలు అలవరుచుకున్నాడు. తను తెల్లవాడైకూడా, తెల్లవాళ్ళని ఎంతో హింసించేవాడు.

"లూయియా అక్కడొక కేబిన్‌లో ఒక తెల్ల అమ్మాయితో ఉండేవాడు. అతను యింగ్లీషులేక్స్‌కి వెళ్ళినప్పుడు, ఆ అమ్మాయి అతనికోసం ఎదురుచూసిచూసి చచ్చిపోయింది," అన్నాడు వర్తు.

ఆవులు మేతమేస్తూ ఆ కేబిన్‌వైపుగా వెళ్ళినప్పుడు, వెనక్కిమళ్ళిస్తూవుండేవాడు వియిట్. ఒకరోజున మరీదగ్గిరికి వెళ్ళి, ఆవులు యింక పైకి కదలకుండా నిలిచిపోయాయి. ఆవుల మెళ్ళో గంటలు ఎప్పుడయితే ఆగిపోయాయో, అప్పుడు పిల్లలిద్దరూ తలపైకెత్తిచూశారు. రెడ్ యిండియన్‌ని పోలినమనిషి ఒకతను, తుపాకీపుచ్చుకు నిలబడటం కనిపించింది. పిల్లలిద్దరూ కొద్దిగా కంగారుపడి, గొడ్లని పొదలకి యివతలగా తోల నారంభించారు.

"ఎవరి గొడ్లు యివి?" అని అడిగాడు కొత్తతను.

"కోవెన్ హావెన్‌గారివి," అన్నాడు వియిట్.

"ఇక్కడ దగ్గిరలో ఏదో సెటిల్‌మెంటు వుందిటగా - అక్కడివేనా?" అని అడిగాడు కొత్తతను. మనిషి భారీగా ఉన్నప్పటికీ, వర్తు అంతదృఢంగా లేడు. లేతనీలపురంగుకళ్ళతో పిల్లలిద్దరినీ పరీక్షగా చూశాడు. ప్రాణాలమీద ఆశవున్నవారు, అతని ముందునించి నడవటానికి జంకుతారు. "అయితే మీ యింటిపేరు కోవెన్‌హావెనా?"

"మాయింటిపేరు లకెట్. ఆ అమ్మాయి నా సోదరి," అన్నాడు వియిట్

గొడ్లు, అక్కడిపొదదాటి అవతలకి వెళ్ళకుండా, కాపాడుతున్నాడు వియిట్. నూలీకూడా అదేపనిచేస్తోంది. ఇద్దరూ జాగ్రత్తగా ఆ లూయీ దృష్టిపథంనుంచి తప్పుకున్నారు. లూయీది భయంకరమైన ఆకారం. అతనుపెట్టుకున్న ఎర్రటోపీ రక్తాన్ని జ్ఞప్తికి తెస్తుంది.

"లూయీ అంటే వాడే నంటావా?" అని అడిగాడు వియిట్ నూలీని.

"వాడేలావున్నాడు," అంది నూలీ.

గొడ్లని గొడ్లసాలలో వదిలిపెట్టేక, పిల్లలిద్దరూ పెరిగెత్తుకుంటూ యింటికొచ్చి, తాముచూసిన కొత్తమనిషిగురించి యింట్లోవాళ్లకి చెప్పారు.

పిల్లలు చెప్పినదివిని, "వాడిసంగతి నేను కనుక్కుంటాను," అన్నాడు వర్తు.

"కనుక్కునేందుకు, అతను మనపిల్లల్ని ఏమన్నాడు గనక! ఏమీ అనలేదుగా! ఎవరిపిల్లలు? - అని అడిగాడు; అంతే. నాకోసారి కనిపిస్తే బాగుండును ఆమనిషి!" అంది ఆశ్చా.

జూన్ బెర్రీలు పండేలోపునే ఆశ్చాకి ఆ అవకాశం కలిగింది. అందరూ సాయంత్రవు భోజనానికి కూర్చున్నారు. నూలీ, కిటికీలోనుంచి, తమ కేబిన్ వైపుగా వస్తున్న ఎర్రటోపీచూసింది.

వర్తుమొహం నల్లబడింది. పిల్లలు ముడుచుకుపోయారు. సేవర్డుమట్టుకు తనపని తనుచూసుకుంటోంది. ఎవరూవెళ్లి తలుపు తెరవకపోవడంవల్ల, తనేవెళ్లి తలుపు తెరిచింది.

"నాన్న యింట్లో ఉన్నారా?" అని అడిగాడు అవతల మనిషి.

"ఉన్నాడు," అంది సేవర్డు.

లూయీని చూసి భయపడవలసిందేమీ ఆమెకి కనిపించు లేదు. కొత్తతను లోనికివచ్చాడు. అతిథి మర్యాదగా వర్తు నిల

బడ్డాడు. పురుషులిద్దరూ పరస్పర గౌరవ వాచకాలు మాట్లాడు కున్నాక, లూయిూ అన్నాడు: "జార్జి రోబక్, ఆ వర్తకు డున్నాడే అతను, మిమ్మల్ని చూడమన్నాడు."

"అలాగా!" అన్నాడు వర్తు అయిష్టంగా.

"నా కేబిన్ పైభాగం చెడిపోయింది. మీ దగ్గిర పరిక రాలన్నీ వున్నాయట. మీవల్ల నాకు సహాయం లభించగలదని చెప్పాడు రోబక్."

వర్తుకి అతనితో మాట్లాడటమే యిష్టంలేదు. కాని, యింటికొచ్చిన వానితో మాట్లాడకుండా వుంటే, అనవసరంగా కలహాలు వస్తాయి. "వడ్రంగం వచ్చునుగాని, యిప్పట్లో నాకు తీరికలేదు," అని అన్నాడు వర్తు.

"తొందరలేదు. యింకొన్నాళ్లు ఆగగలను. మీకు తీరిక చిక్కినప్పుడే చూదురుగాని!"

సంభాషణ వంకరదారి పట్టిందిగాని సూటిగా నడవటం లేదు. భోజనాల వేళయందు వచ్చిన అతిథికి, భోజనం పెట్టకుండా పంపడం, ధర్మంకాదు. అందుకని వర్తు అన్నాడు: "భోంచేసి వెళ్ళండి." - ఆ ఆప్యాయత అంతర్యంలో నుంచి రావడం లేదని, లూయిూ గ్రహించేపాటి సావకాశం లేనంత చక్కగా చెప్పాడు వర్తు.

"థాంక్స్" అన్నాడు లూయిూ.

ఆశ్చా కూచున్న కుర్చీపీట ఖాళీ చేసి, లూయిూకి యిచ్చారు. ఆశ్చా, జెన్నీ యిద్దరూ ఈ ఎఱ్ఱ టోపీ మనిషిని వింతగా పరిశీలిస్తున్నారు. జెన్నీ ఆ పూట సరిగ్గా తిండి తినలేదు.

వియొలెట్ దగ్గిరున్న కత్తిలాటిది తనదగ్గిరవుంటే, నాన్నకి కనిపించకుండా, పిల్లల అడుగునుంచి దూరి, ఈ రెడ్ యిండియన్ పస పట్టించి వుందును కదా - అని అనుకుంది నూలీ మనసులో.

భోజనాలయేటప్పటికి లూయీ వర్తుతో, తను ప్రభుత్వం పక్షం మనిషిని కానని చెప్పాడు. ఏదిరైటో ఏదితప్పో తెలుసుకునేందుకు ఒకసారి జనరల్ వేనీ పక్షాన పని చేశాడట తను. లూయీ మాటలు విన్నకొద్దీ వర్తుకి, అతనిమీద వున్న దురభిప్రాయం పోసాగింది. వియొలెట్‌కి కూడా లూయీ దుర్మార్గుడు కాడనిపించింది. పోతే నూలీకి మట్టుకు అతనిమీద మంచిభావం ఏర్పడకుండా వుంది. తోడేలుపిల్ల కళ్ళవలె, ఆ అమ్మాయి నేత్రాలు అతని ప్రతి కదలికనీ పరిశీలిస్తున్నాయి.

భోజనానంతరం వర్త్, లూయీ చుట్టలు ముట్టించి, నిప్పులపొయ్యిపక్కన కూచున్నారు. యుద్ధపు దినాలలోని తన సాహసకృత్యాలు చెప్పాడు లూయీ. "ఈ అడవులలో నేను దాక్కుని వున్నప్పుడు వాళ్లు చచ్చినా పట్టుకోలేక పోయేవారు," అంటూ తన వీరగాధలు వర్ణిస్తున్న కొద్దీ, వర్తుకీ వియొలెట్‌కీ యితనిమీద గౌరవం కొంచెం హెచ్చింది. ఈ కబుర్లు వినేందుకు జెన్నీ నడవలోకి వచ్చి కూచుంది. నూలీ యిదంతా పరీక్షగా కనిపెడుతోంది. జెన్నీఅక్క కళ్లు ఎందుకనో ధగధగ లాడుతున్నాయి; ఈ రాత్రి ఆమె ఎంతో అందంగా ఉంది. ఒకసారి లూయీ, పిల్లలు చుట్టూతా వున్న ఆడపులిని, చంపలేక పోయాడట. తల్లి వెంటనున్న ఆ పిల్లలనీ, ఆ తల్లినీ చూసేవేళకి అతని హృదయం ద్రవించి పోయిందట.

మాసికలుపడ్డ వియిట్ చొక్కా కుడుతూ సేవర్డు ఒక మూలని, చీకటి వున్న మూలని, కూచుంది. ఇంట్లో వున్న అందరి లోనూ లూయీ విషయమై హాకావృష్టి కనబరచనిది ఆమె ఒక్కతే! సూలీకి పెద్దక్కని చూడగానే ఏదో ప్రేమ పుట్టుకొచ్చింది - తను వెళ్ళి ఆమె పక్కని కూచుంది.

“పడమటికి ఎప్పుడు వెళ్తున్నారు?” అని అడిగాడు వర్తు లూయీని.

“నేను యిక్కడే సెటిల్ అయిపోతాను. బేస్టేట్ నుంచి ఎవరో ప్లీడరు వచ్చాడట. నా కేబిన్ పరిసరాలలోని నేల విషయమై నాకు గల హక్కులని ఆయనతో సంప్రదించాలి.”

వర్తు తల వూపాడు. లూయీ మరొక చుట్ట అందించాడు వర్తుకి.

“సెటిల్మెంటులో వున్న ఆ ప్లీడరు యిల్లు మీకు తెలిసివుంటుంది. మరొకసారి ఎప్పుడైనా యిటుగా వస్తాను. అప్పుడు మీలో ఎవరైనా నాకు అతని యిల్లు చూపిద్దురుగాని!”

“ఓ - దానికేముంది? మా అబ్బాయి వియిట్ చూపిస్తాడు,” అన్నాడు వర్తు.

“థాంక్స్. ఒకవేళ వియిట్ ఆవులవెంట వెడితే, మిస్ జెస్సీ చూపించ గలదుగా?”

# 11. జెన్నీ

"ఇంత అర్ధరాత్రివేళ యింటికేమి వెళ్తారు?" అని అన్నాడు వర్తు లూయితో. తమ కేబిన్‌లో ఆ రాత్రికి వుండి, తెల్లారి వెలుగొచ్చాక, వెళ్ళవచ్చు నన్నాడు. లూయీ అందుకు అభ్యంతరం చెప్పలేదు.

తనకంటె చిన్నవాడయిన లూయీని చూసేటప్పటికి, వర్తుకి మొదట్లో కలిగిన చీకాకుపోయి, యిష్టత ఏర్పడ నారంభించింది. వియిట్, జెన్నీ పెద్దవాళ్ళ కబుర్లు జాగర్తగా వింటూ కూచునే వారు.

రానురాను లూయీకి ఈ కేబిన్‌లో చనువు ఏర్పడింది. ఒకరోజు మధ్యాహ్నం సూలీ, జెన్నీ, ఆశ్చాలు మాక్‌విటర్స్ యింటికి వెళ్తున్నప్పుడు, అడవులలో చిన్న పిల్లలు ఒక్కరూ వెళ్ళడమెందుకు, తను కూడా సాయం వస్తానన్నాడు. అందరూ బాగానే వుందనుకున్నారు.

చీకటిపడే సమయానికి సూలీ, ఆశ్చాలు యింటికి వచ్చారు.

"జెన్నీ ఏది?" అని అడిగాడు తండ్రి.

సూలీ ఆశ్చాపవంక భావార్థకంగా చూసింది.

"అతనూ అదీ మా దగ్గిర్నుంచి పారిపోయారు," అంది ఆశ్చా బిగ్గరగా.

వర్తు నిప్పుల పొయ్యివైపుగా చూశాడు. వివరాలు అడుగుదామనుకున్నాడు గాని, అవి అడగటం అప్రస్తుతం అని పించింది. సేవర్డులాటి ఎదిగిన పిల్ల ముందు, అటువంటివి అడగ కూడదు. రేపురాత్రే పౌర్ణమి! చంద్రకళలతోపాటు స్త్రీల ధైర్య సాహసాలు పెరుగుతాయనే సామెత వుండనేవుందిగా!

అందరూ పక్కలమీద పడుకున్నారు. నిప్పుల పొయ్యి లోని కట్టెలు పల్చగా వెలుగుతున్నాయి. జెన్నీ, లూయీ బాటన వేళ్ళమీద నడుచుకుంటూ లోపలికి వచ్చారు.

"నాన్న ఏమీ అనడు - నువ్వు వుండిపోవచ్చు," అంది జెన్నీ.

మొలలోనికత్తి పక్కగా వుంచి, విశ్రమించాడు లూయీ. జెన్నీ నిప్పులపొయ్యి దగ్గిరికి వెళ్ళి, కట్టెలు కొంచెంగా కదిపి, తను వేసుకున్న గౌను వొదిలేసి రాత్రిగౌను వేసుకు, సేవర్డు పక్కన పడుకుంది.

వర్తుకి నిద్రపట్టలేదు. ఎన్నో ఎన్నెన్నో ఆలోచనలు వస్తున్నాయి. మొగవాళ్ళు వెంటపడే ఆడకూతురు, తన యింట్లో వుందని, యిన్నాళ్ళూ తనకి తట్టనేలేదు. నిజానికి, లూయీ అంత చెడ్డవాడు కాదు. చిన్నతనంలో అతనిని రెడ్ఇండియనులు

ఎత్తుకు పోయారంటే అందులో అతని తప్పేముంది? ఎవరివల్ల పెంచబడ్డా, లూయీలో కొన్ని మంచిగుణాలు లేకపోలేదు.

తన అభ్యంతరం రెడ్ యిండియనులు పెంచినారనికాదు. ఈ లూయీకి కాలు నిలకడలేదు. ఇక్కడ కొన్నాళ్ళూ - అక్కడ కొన్నాళ్ళూ - యింకోచోట కొన్నాళ్ళూ - అనుకుంటూ ఎక్కడా స్థిరపడక పోతే ఎలా? ఏదో ఒకచోట స్థిరపడాలి.

ఆ మాట కొస్తే, యిరవై ఏళ్ళ క్రితం తనకి మాత్రం స్థిరత్వమెక్కడ వచ్చింది? ఇరవై ఏళ్ళ క్రితం తనకి కనిపించిన జేరీ, ఈ నాటి జెన్నీకి మల్లేనే ఉండేది.

లూయీకి పెళ్లి చేసుకోవాలని వుంటే, మరొక పిల్లని చూడవచ్చు. జెన్నీ అతనికి తగదేమో! పెళ్ళిదేముంది - యిద్దరూ కలిసివుండగలగడం ముఖ్యంగాని! నిర్మానుష్య ప్రదేశంలోని ఆ కేబిన్‌లో జెన్నీ ఒక్కతె ఉండగలదా? ఆ వెనకటి తెల్ల అమ్మాయికి వలెనే అవుతుందేమో తన కూతురి గతి కూడా!

మర్నాడు ప్రొద్దుట వర్తు, సేవర్డ్ ని కేబిన్ బయటికి పిలిచి యిల్లా చెప్పాడు: "జెన్నీని తన యిష్టమొచ్చినట్టు తిరగవద్దన్నానని చెప్పు. ఈడువచ్చిన ఆడపిల్ల అడవులవెంట ఆ విధంగా లూయీతో తిరగడం మంచిదికాదు." ఆ మాటలు చెప్పేసి, తుపాకీ పుచ్చుకు వెళ్లిపోయాడు వర్తు.

సేవర్డు తండ్రిని తలుచుకు జాలిపడింది. ఆ చెప్పే మాటలు, తండ్రి తన మొహంలోకి చూస్తూ చెప్పలేకపోయాడు. లూయీని యింతదాకా తీసుకువచ్చిందెవరు? - తండ్రేగా! వాళ్ళేదో శత్రి

ప్రేమతో కట్టుకుంటున్న గూటిని పడగొట్టమంటే, అది తన చేత నయ్యే పనా? తనకి చేతులు రావద్దూ?

చేయడం కంటె చెప్పడం తేలిక - యిలాంటివి. రెండు జంతువుల్ని కలిపినట్టు మనుషుల్ని కలపగలమా? మానవులు అడవి పిట్టలవంటివారు. అడవి పిట్టల ఆనందం మనకి సులువుగా అర్థం కానట్టే, మానవహృదయాలు కూడా అర్థం కావు.

తండ్రిమాటలు జెన్నీకి చెప్పాలనుకుంది సేవర్డు. లూయీ, జెన్నీలు షికారుకి వెళ్ళివచ్చాక, జెన్నీ ముఖంలోకి చూసేవేళకి, సేవర్డుకి ఆ మాటలు చెప్ప బుద్ధి కాలేదు. తన చెల్లెలు హృదయాన్ని రంపంతో కొయ్యలేకపోయింది. పరిమళిస్తూన్న పుష్పంలోని రేకులు త్రుంపడానికి చేతు లెలా వస్తాయి?

సేవర్డు వంటపొయ్యి దగ్గిర పనిచూసుకుంటూ, తనలో తను అనుకుంది: లూయీ తన చెల్లెలుపట్ల ప్రేమతో ఉంటాడేమో! దానికీ అతనికీ మనసు కలిస్తే, అతను వెనకటి విధంగా పారిపోడేమో - యింటి నంటిపెట్టుకు వుంటాడేమో!

"ఏమైనా ఈ సారి అతనితో నేను మాట్లాడి విషయం తేల్చుకుంటాను. జెన్నీ చిన్నపిల్ల. అభమూశుభమూ తెలియనిది. ఎవరూ కాదు, నేనడుగు తాను అతనిని," అని తలపోసింది సేవర్డు. కాని, ఆ అడిగే అవకాశం సేవర్డుకి కలగలేదు.

# 12. సూలీ

ఈ మారుమూలప్రదేశంలో స్త్రీలు మొగవారికి వలె కష్టించడంలో ఆశ్చర్యం లేదు. ఆళ్ళు గొడ్డలి పుచ్చుకు చెట్లు నరికేవి; పాటలుపాడుతూ జెన్నీ ఆకులు ఏరేది. వియిట్, సూలీలు గొడ్లని కాసేవారు. ఎవరికి తగ్గపని, వారు చేస్తూండేవారు.

వియిట్, సూలీలు యిద్దరూ రోజూ వచ్చేవేళకి సాయంత్రం యింటికి రాకపోయేటప్పటికి, సేవర్డు మొదట్లో అంతగా కంగారుపడలేదు. కాని, చీకటిపడ్డా వారి జాడ కనిపించక పోయేటప్పటికి, ఆమె కోవెన్ హావెన్స్ యింటికి వెళ్దామను కుంది.

ఇంతలో, పాలిపోయిన ముఖంతో, వియిట్ కనిపించాడు.

"సూలీ ఏది?" అని అడిగింది సేవర్డు తత్క్షణం.

వియిట్ లోపలికొచ్చి, తలుపు పక్కన నిలబడ్డాడు. ఏదో తప్పు చేసిన వాడిలా బెరుకు బెరుకు చూపులతో నిల బడ్డాడు. ఆవులు ఆనాడు చాలా దూరం వెళ్ళాయట; అంత దూరం ఎప్పుడూ వెళ్ళలేదట. ఆవులు ఒక కొండ గుట్ట ఎక్కేదాకా తనూ సూలీ వాటి మెడ గంటలు కూడా వినలేదట. బహుశా,

డోమకాటుకి బెదిరి, అటుగా వెళ్ళి వుంటాయి. వాటిని తోలు జోతే, అవి సెటిల్‌మెంటు వైపుగా నడవక, తమ యిష్టం వచ్చిన దారి పట్టాయి. ఎంత గట్టిగా బాదినా, వాటి దారినే నడవజొచ్చాయి.

కొంతదూరం ఆ ప్రకారంగా వెళ్ళాక, అవి వెనక్కి తిరుగుతాయని తను సూలీకి చెప్పాడు. రెడ్ యిండియనులు వుండే గ్రామం వైపుగా తను రానంది సూలీ; తనకు దారి తెలుసు కాబట్టి, మిసెస్ కోవెన్ హావెన్‌కి ఈ సంగతి తెలియ బరిచి, యింటికి వెళ్తానంది సూలీ.

వియిట్ వెనకాల వస్తూండగా, ఆవులు ముందు పరిగెడుతున్నాయి. తను యింతకి పూర్వం చూసి ఎరగని ప్రదేశాల వెంట దారి తీస్తున్నాయి ఆవులు. ఒక చిన్న నీటివాగు దాటి, రెడ్ యిండియనుల గ్రామమూ అనిపించే చోటికి వచ్చాడు తను. అదొక పెద్ద గొడ్లశాల. ఒక పెద్దాయన తనవంక పరిశీలనగా చూశాడు. తను ఎక్కడికి వచ్చినదీ అంతదాకా తెలియనే లేదు.

"అయితే, ఆయన మిస్టర్ కోవెన్ హావెన్ కాబోలు. అబ్బాయిగారు దారి తప్పితే, ఆవులు దారి చూపించాయన్న మాట," అంది ఆశ్చా.

"సూలీ ఎక్కడ?" అని అడిగింది జెన్నీ.

"సూలీకి ఏమీ ఫరవాలేదు. వియిట్, నేనూ వెళ్ళి, యింటికి తీసుకొస్తాం. దారి చూపించగలవు కాదురా, తమ్ముడూ!" అని అంది నేవర్డు, ఎటువంటి ఆదుర్దా కనబరచకుండా.

"మేము ఎటు వెళ్లామో, ఆ దారి చూపించగలను. ఆవులు ఎటునుంచి తీసుకొచ్చారో, ఆ దారి నాకు తెలియదు," అన్నాడు వియెట్.

వాళ్లు యింకా బయలుదేరకుండానే, మిస్టర్ కోవెన్ హోవెన్ వచ్చాడు - సూలీ యిల్లు చేరుకుందా అని వాకబు చేయడానికి. రాలేదని విని, వెతకడానికి తనూ వస్తానన్నాడు. దివిటీలా వెలిగించిన కర్ర చేతబుచ్చుకు, వియెట్ ముందు నడవసాగాడు. యిటువంటి ఘోరారణ్యం తను ఈనాటివరకూ చూడలేదని సేవర్డుకూడా అంది. రకరకాల వంకరలు తిరిగినమీదట, ఒక దుంగదగ్గిరికి వచ్చి, యిక్కడే సూలీ తనూ ఆవులమెళ్ళో గంటలు విన్నామని చెప్పాడు వియెట్. ఇక్కడే సూలీ, తనూ విడిపోయారు.

గుట్టపై కెక్కి అక్కడ ఒక చిన్న మంట వెలిగించారు- అడవిలో తప్పిపోయిన సూలీ, ఆ మంటచూసి, అది గుర్తుగా పెట్టుకు, అటువైపుగా వస్తుందనే ఆశతో.

అడవి అదిరేటట్టు "హూ...హూ" అంటూ అరిచింది సేవర్డు.

"సూలీ...సూలీ" అని నోరు బద్దలుచేసుకుంటూ కేకలు పెట్టాడు వియెట్.

వారికి వినిపించినదల్లా ప్రతిధ్వనులు మాత్రమే!

నిశాచార పక్షులు చీకటిలో ఎగురుతున్నాయి. అడవి జంతువులు వాటి ఆహారంకోసమని తిరుగుతున్నాయి. ప్రతి ప్రాణీ తన పరిధిలో ఉంది; పాపం, సూలీయే తప్పిపోయింది.

ఇంతలో చినుకులుపడ నారంభించాయి. ఆ వర్షంలో తన చిట్టిచెల్లెలు, తడిసి ముద్ద అయి, ఎట్లా గజగజలాడుతుందో తలుచుకు ఖిన్నురాలయింది సేవర్డు. చిట్టిచెల్లెలు యింక తన అక్కలనీ, అన్ననీ చూడగలుగుతుందా ?

సేవర్డుకి యింకా ముందుకిసాగాలనే ఉంది కాని వర్షంవల్ల దివిటీలు ఆరిపోయాయి. సూర్యోదయమయితేగాని చుట్టూ ప్రదేశం కనిపించదు. సూలీ విండ్లు విడిపోయిన స్థలమూ, కొండగుట్టపక్కగా వృక్షపొదా పరీక్షగా చూడాలి. ఏ చెట్టు చాటున నక్కివుందో ఈ అర్ధరాత్రివేళ !

సూలీ గురించి కనుక్కువస్తానని వెళ్లిన కోవెన్ హావెన్ ఎంతకీ రాకపోయేటప్పటికి, మిసెస్ కోవెన్ హావెన్, వర్తు కేబిన్ దగ్గిరికి వచ్చింది. జెన్నీ, ఆశ్చాలు ఆమెతో సంభాషిస్తూ కూచున్నారు. తెల్లారేవేళకి కూడా భర్త రాకపోయేటప్పటికి, సూలీకి జరిగిన ఉపద్రవంగురించి చుట్టుపట్లవారికి తెలిపేందుకు, మిసెస్ కోవెన్ హావెన్, సెటిల్‌మెంటుకి ప్రయాణమై వెళ్లింది.

కబురు వినగానే, కష్టంలో వున్నవారిని ఆదుకునేందుకు అందరూ ముందుకొచ్చారు - జేక్ టెంచ్, మొద్దావతారం కూడా తయారయారు. బిల్లీ తన వేటకుక్కలని పట్టుకొచ్చాడు. టాడ్, అతని భార్యా ఎద్దునెక్కివచ్చారు - అతను ముందు కూచుంటే, ఆమె వెనక కూచుంది. కెంటకీ వనిత తన నాలుగో కుర్రవాణ్ణీ, భర్తనీ వెంటవేసుకుని, కాలి నడకని వచ్చింది. మేటియాసూ, వాళ్ళబ్బాయీ వచ్చారు. మాక్‌విర్టర్సూ, మాక్‌ఫాల్స్, వాళ్ళ అయిదారుగురు పిల్లలూ ఆ అడవుల్ని గాలించేసారు.

ఇంతమంది ఆదుకునేవాళ్లు వుండటం ఎంత అదృష్టం - అనుకుంది సేవర్డు.

మాక్‌ఫిర్టర్సూ, మాక్‌ఫాల్సూ కూడా ఈ అన్వేషణా కార్యక్రమంలో పాల్గొంటున్నారని తెలిసి, జేక్ బెంచ్ సేవర్డుతో అన్నాడు: "నువ్వింకేమీ బెంగపెట్టుకో నక్కరలేదు. జూడ్ మాక్‌ఫిర్టర్ సూలీ ఎక్కడ తప్పిపోయిందీ యిట్టే కనిపెట్ట గలడు."

బిల్లీ తన వేటకుక్కల్ని వదిలిపెట్టాడు.

"ఏదైనా అడవిమృగం అమ్మాయిని హింసించివుంటే, ఈ వేటకుక్కలు ఆ సంగతి పసిగట్టి మనకి చెప్పగలవు," అని సముదాయించింది ఎల్లెన్ మాక్‌ఫిర్టర్ సేవర్డుని.

మర్నాడు మధ్యాహ్నానికి అవి, ఒక చిన్నపిల్ల కాలిజాడని కనిపెట్టగలిగాయి. మూడోనాటికి ఆ కాలిజాడకూడా మాయ మయింది.

ఈ వేళప్పుడు నాన్న లేకపోవడమూ, - అని సేవర్డు ఎంత గానో విలపించింది. ఈ కష్టసమయంలో నాన్న తమ దగ్గిర వుండకపోవడం తమ దురదృష్టం! ఆఖరమ్మాయి అడవులపాల యిందని ఆయనకింకా తెలీదు.

ఆ మర్నాడు సాయింత్రం, బుజాన తుపాకీతో, గుమ్మం ముందు ప్రత్యక్షమయ్యాడు తండ్రి.

"ఎందుకు ఈ మనుషులంతా యిలా వచ్చారు?" అని దగ్గిరలో కనిపించిన జెన్నీని అడిగాడు వర్డు.

ఆ అమ్మాయి వెనక్కి తగ్గి, జవాబు చెప్పలేకపోయే టప్పటికి వియిట్‌నీ, ఆశ్చానీ అడిగి, వారూ అదే పద్ధతి అవలంబించగా, నిప్పులపొయ్యిదగ్గిర ఉన్న సేవర్డుని, "తూలీ ఏది ?" అని అడిగాడు.

"గొడ్లతో రావలసినది వెనక్కి రాలేదు," అంది సేవర్డు.

బోనులోపడ్డ మృగంలా బెదిరి, "ఎప్పుడు జరిగింది యిది?" అని అడిగాడు.

సేవర్డు చెప్పింది.

"ఇంతవరకూ అడవిలోనుంచి బయటికి రానేలేదుగా ?"

సేవర్డు, జరిగిన కథ చెబుతూండగా, యిరుగు పొరుగు వారు వర్తుని సానుభూతితో చూడసాగారు. తనకి కలిగే పరితాపాన్ని ఆపుకోలేకుండా వున్నాడు వర్తు.

అంతా విన్నమీదట, తాగినవాడిలా మొహంపెట్టి, "లూయీ ఎక్కడ?" అని అడిగాడు సేవర్డుని.

ఆమె జవాబు చెప్పలేదు.

"లూయీని రప్పించవలసింది," అన్నాడు వర్తు. అంటూ, సేవర్డుకళ్లలోకి చూడలేకపోయాడు. "లూయీకి ఈ అడివిలో తెలియని చోటు లేదు."

మర్నాటి ఉదయానికి లూయీ వచ్చాడు - ఎప్పుడూ వేసుకునే వింత దుస్తులతో వచ్చాడు.

"యింత వరకూ నాకు కబురు పంపలేదన్నమాట," అంటూ సేవర్డువంక క్రూరంగా చూశాడు లూయీ.

తన ప్రమేయం పెట్టుకోకుండా వుందామనుకున్నారుగాని, తప్పనిసరి అయి కబురు పంపవలసి వచ్చింది - అని భావించాడు లూయియా. ఆ భావన అతనికి ప్రత్యేకతనిచ్చింది. ఈ అన్వేషణా కార్యక్రమంలో తనింక నాయకుడై నట్టుగా కల్పించుకోజొచ్చాడు. ఎవరెవరు ఎటువైపు వెళ్లినదీ, ఎటువైపు వెళ్ళనిదీ ఆరా తీశాడు. ఒకరికొకరు మరీ దూరంగా వుండకుండా, క్రమపద్ధతిలో వెతికేట్టూ, గుర్తులు కనిపించగానే, బక్‌మాన్ అనే ఆయన బూరా వూదేటట్టూ పథకం వేశాడు లూయియా.

"సజీవినో మృతజీవినో యివ్వాళ పట్టుకుతీరాలి," అన్నాడు లూయియా సేవర్డువంక కాఠిన్యంతో చూస్తూ.

ఆరోజు మధ్యాహ్నం ఎన్నిసార్లు బూరా వూదారో, కేబిన్‌లో వున్న స్త్రీలకి తెలియదు. కారణమేమిటంటే, వారికి వినిపించదుగనక! మర్నాడు వుదయానికీ, మర్నాడు రాత్రికీకూడా వెళ్లిన మగవాళ్లు వెనక్కి రాలేదు - అదే పనిగా వెతుకుతున్నారు. యింకొన్నాళ్లు గడిచాక, యిద్దరు పెద్దవాళ్లు దగ్గుకుంటూ కేబిన్ దగ్గిరికి వచ్చారు. ఇంతవరకూ, నూలీజాడ తెలియలేదట. లూయియా కంటికి దెబ్బ తగిలింది; వర్తు, లూయియాలమధ్య బిల్లీ వేటకుక్కలు అనవసరమనిపించాయట.

చెట్టు బెరడుని ఎవరో కొరికినట్టు మొదటిరోజున కనిపించింది. అదే చెట్టు కొమ్మమీద ఎర్రటి దారపుపోచ కూడా కనిపించింది. ఆ గుర్తులు పట్టుకు ముందుకి సాగారు. మూడో రోజుకి ఒక చెట్టు తొర్ర దగ్గిరికి వచ్చారు. ఆ చెట్టుతొర్రలో ఆకులు పరుచుకు, నూలీ అక్కడొక రాత్రి గడిపి వుంటుంది. ఒక

రాత్రేకాదు, ఒక రోజల్లా అక్కడ గడిపి వుంటుంది. ఆ చెట్టు తొర్రనే నివాస యోగ్యమైన ఒక చిన్న యిల్లుగా చేసుకుంది ఆ అమ్మాయి.

ఈ కథ చెబుతూంటే జెస్సీ వినలేకపోయింది; తలని పక్క బట్టలలో దూర్చి వాపోయింది. ఇక ఆశ్చా ముఖం విస్తృతంగా తయారయింది. సేవర్డు నిప్పుల పొయ్యిలోకి చూస్తూ, "సూలీ! సూలీ!! ఎక్కడున్నావ్?" అంది వేదనతో.

మరొక యిద్దరు మనుషులు ఒక వారం రోజులపాటు అడివి అంతా గాలించి వచ్చారు; ఫలితం లేకపోయింది.

సూలీ ఎక్కడ తల దాచుకుందో, ఆ స్థలం తెలిసింది గాని, తదుపరి ఆచోకీ తెలియదు. ఆ చిన్న పాదాలు చెట్టు తొర్ర వైపుగా వెళ్ళడమే కనిపించిందిగాని, బయటికి వచ్చిన గుర్తులు లేవు. ఆ చుట్టుపట్లనున్న అడవి అంతా గాలించిన మీదట కనిపించినది ఏమిటంటే, గుర్రపు డెక్కల గుర్తులూ రెడ్ యిండియనులు చలిమంట వేసుకున్న స్థలమూ - ఈ రెండూ తప్ప మరొకటేమీ కనిపించలేదు.

వర్తు, లూయియాలు వెనక్కి రాలేదు. ఏదైనా జంతువు, పిల్లని పొట్టనెట్టుకుందేమో అనుకునేందుకు, చెట్టుతొర్రలో ఎముకలుగానీ, మాంసంగానీ అలాటివేమీ లేవు. వారిద్దరూ అడవి అంతా ఎంతగానో గాలించారు. సూలీ జాడ కనపడలేదు.

ఇక్కడ యింటిదగ్గిర మిగతాపిల్లలు ఆకలితో అలమటిస్తున్నారు. ఒకరోజు వుదయం లూయియా, లేడి మాంసంతో వర్తు

కేబిన్ ముందు ప్రత్యక్షమయేటప్పటికి, యింట్లోవాళ్ళకి ప్రాణం లేచివచ్చింది. వర్తు యింకా వెతుకుతూ ముందుకిపోయాడనీ, తను యిలా వెనక్కి వచ్చానని చెప్పాడు లూయీ. సూలీ లేని కేబిన్ చూడదల్చుకోలేదట వర్తు; శీతాకాలంలో గడ్డకట్టుకుపోయే మహానది ఎగువకి పోతాడట. ఆ నదిగట్టునే నడుస్తూ ఎంతదూరం పోవడానికి వీలువుంటుందో, అంతదూరం పోవాలనే వాంఛ, వర్తు మనసులో ఎన్నాళ్ళబట్టో ఉంది. అది ఈనాటికి ఈ విధంగా సఫలమయింది.

"తను తిరిగివచ్చేదాకా, మీకు కావలసిన ఆహారం విషయమై, నన్ను చూడమన్నాడు," అన్నాడు లూయీ సేవర్డుతో.

సేవర్డు ఏమంటుంది? తనకీ తన చెల్లెళ్ళకీ తమ్ముడికీ ఆహారం తీసుకువచ్చిన మనిషిని ఏమంటుంది? తప్పిపోయిన తమ చిట్టి చెల్లెలుకోసం అహోరాత్రాలూ కష్టపడ్డ మానవుణ్ణి తను ఏమనగలదు? సూలీ చనిపోయిందేమో! చనిపోయినవాళ్ళతో మిగతావాళ్లు చావరుకదా! బతికున్న చెల్లెళ్ళకీ తమ్ముడికీ ఆహారం తీసుకొచ్చిన పెద్దమనిషిని ఏమంటుంది? - ఏమీ అనలేదు. భోజనాలయాక, తను ఒక్కర్తె, అడవులలోకి వెళ్ళి, కాళ్లు నొప్పులు పుట్టేదాకా తిరిగింది. అలా తిరిగితేగాని ఆ మనోబాధ తగ్గదు.

చెట్లన్నీ వింతమృగాలవలె నిలబడ్డాయి. అందులో కొన్ని బతికున్న చెట్లు, మరికొన్ని చచ్చిపోయినవి. ఆ చెట్లమధ్యనుంచి

నడుస్తున్నప్పుడు, అక్కడ పడే వెలుతురుకూడా వింతగా తోచింది సేవర్డుకి. పగలంతా ఆకుపచ్చటికాంతి; రాత్రి అంతా ఎర్రటి కాంతి; ఈ ఎరుపూ, ఆకుపచ్చరంగుల మధ్య తాము బ్రతుకుతున్నారు.

ఈ చెట్లలోకూడా రకాలు వున్నాయి. కొన్ని మనకి సన్నిహితంగా కనిపిస్తాయి. మరికొన్ని భీతి గొల్పుతాయి. పగటి వేళ అయినాసరే, ఈ చెట్లమధ్యనుంచి నడుస్తూంటే, ఎవరో మనల్ని వెనకనుంచి కనిపెడుతూన్నట్టుగా ఉంటుంది. నాలుగు నెలలపాటు కేబిన్ వదిలిపెడితే, దానిచుట్టూ దానిలోనుంచి కూడా చెట్లు మొలిచేస్తాయి. నిద్రపోయి లేచేటప్పటికి, మనం పడుకున్నచోట చెట్లు మొలిచేటట్టుగా ఉంటుంది యిక్కడి స్తితి.

ఎవరో పిలుస్తున్నట్టుగా తోచింది సేవర్డుకి. దూరంనుంచి, చాలాదూరంనుంచి, సూలీ "అక్కా!! నాన్నా!!" అని పిలుస్తున్నట్టుంది. నదీజలం రాళ్ళమీదనుంచి, కర్రలమీదనుంచి దూకుతున్నప్పుడు చేసే శబ్దంసుమా - అని సేవర్డుకి తెలుసు!

కాళ్ళు బాగా నొప్పులు పుట్టేదాకా తిరిగింది సేవర్డ్. మరీ ఎక్కువగా తిరిగితే, తను కూడా సూలీకిమల్లే దారి తప్పిపోవచ్చు; నేలమీద పసరిక బాగా మొల్చింది. ఈ పసరికా, అడవి మొక్కలూ కాళ్ళకి మెత్తగా తగులుతున్నాయి. దూరాన దేవదారు వృక్షాలు పహారా జవానులవలె నిలబడి వున్నాయి.

సేవర్డ్ నిశ్చేష్టురాలై నిలబడింది.

తను యిందాకా విన్నది నీటి గలగల కాదు; ఎవరో మనుషుల కంఠాలు. వారి పాదాల గుర్తులు స్పష్టంగా అగుపడు తున్నాయి. ఆ గుర్తులు దేవదారు చెట్ల నీడవైపుగా వెళ్ళి, బంగారు రంగు యిసుక దగ్గిర ఆగాయి. సేవర్డుకి వాళ్ళు స్పష్టంగా కనిపించారు. ఒక అమ్మాయి, ఒక పురుషుడు.

లేడిపిల్లలా నుంచుని వారిని ఒక క్షణకాలం పరిశీలించింది సేవర్డ్. ఆ పైన నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ, కేబిన్ వైపుకి నడిచింది.

# 13. విశాల ప్రపంచం

"ఎప్పుడు పెళ్ళి చేసుకుందామనుకుంటున్నారు?" అని అడిగింది సేవర్డు ఆ జంటని, వారు కేబిన్ చాయలకి రాగానే.

క్రోధోద్దీపితమైన చూపులు ప్రసరించాడు లూయీ. అటువంటి ప్రశ్నకి అతను సంసిద్ధుడు కాలేదు.

"ఇంకా నేనా విషయం ఆలోచించలేదు. ఓహీయో వెళ్ళాల్సిందే - ఈ దగ్గరలో మతగురువులు లేరు," అని అన్నాడు లూయీ కొంచెంగా స్మితపడుతూ.

"అయితే జెన్నీని పడవలో తీసుకువెళ్ళు. దానికి అభ్యంతరం వుందని అనుకోను," అని తేల్చేసింది సేవర్డు.

జెన్నీ తీక్షణపు దృక్కులూ, ఆశ్చా కాఠిన్యపు చూపులూ ఆ క్షణాన గ్రహించలేకపోయింది సేవర్డు. ఆ తర్వాత తెలిసాయి - అది వేరే సంగతి. పెళ్ళికూతుర్ని తీసుకుని, లూయీ ప్రయాణమవబోయేముందు, రెండు మాటలు చెబుదామనుకుంది: "లూయీ కష్టసుఖాలు తెలిసినవాడు; జెన్నీ చిన్నపిల్ల, అమా

యకురాలు.' - యిలాంటివే చెబుదామనుకుంది; కాని, ఆఖరి క్షణాన సంశయించి వూరుకుంది.

*　　　　　　*

వివాహానికి ముందు, యిటువంటి ప్రయాణానుభవం చాలామంది వధువులికి కలగనే కలగదు - అని జెన్నీ తన అదృష్టానికి మురిసిపోయింది.

నీటిమీద తేలే ఆకులా పడవ సాగిపోతూవుండగా, ఆ పడవలో ఎంతో ఆనందంగా ప్రయాణం చేశారు జెన్నీ, లూయీలు. దిగువకి వెళ్తున్నకొద్దీ నది వెడల్పు పెద్దది కాజొచ్చింది. మళ్లీ ఎగువకి, తమ కేబిన్‌దగ్గిరకి వెళ్ళేందుకు అయిదారు రోజులపాటు గెడవెయ్యాలి. చెల్లెలూ, తమ్ముడూ, అక్కా లేకుండా రాత్రి గడపడమనేది, జెన్నీ జీవితంలో అదే మొదటిసారి. ఇంక తను జెన్నీకాదు, - లూయీ భార్య.

తిరిగీ యింటికి వస్తున్నారు. తండ్రి కేబిన్ కనుచూపు మేరలో ఉంది. జెన్నీ గెడ పడేసి, ఆకుపచ్చ మేజోళ్లు తొడుక్కు, కొత్తజోళ్లు వేసుకుంది. పడవ, రేవులోకి వచ్చేవేళకి, జెన్నీ నేత్రాలు అశ్రుపూరితములయాయి. గట్టుమీద నుంచున్నారు తన వాళ్ళందరూ. వియిట్ పడవని వడ్డుకి దగ్గిరసా లాగుతున్నాడు. ఆశ్నా, సేవర్డులు తన వంక చూస్తున్నారు.

తుపాకీ బుజాన వేసుకు నాన్నా, 'ఏం తెచ్చావు అక్కా?' అని సూలీ - ఆ యిద్దరూ కూడా కనపడితే ఎంత బావుండును - అని అనుకుంది జెన్నీ.

ఆశ్చా కళ్లు జెన్నీ వేసుకున్న కొత్త మేజోళ్ళ మీాద ఉన్నాయి.

"కులాసాగా వెళ్లి వచ్చారా?" అని కుశల ప్రశ్న వేసింది సేవర్డు.

తొలి సిగ్గుతో జవాబు చెప్పింది జెన్నీ.

"మీారిద్దరూ పెళ్లి చేసుకున్నారా?" అని అడిగాడు వియిట్.

"ఎందుకు వెళ్ళారనుకున్నావ్?" అని వెటకారంగా పలికింది ఆశ్చా.

"ఇక నుంచి నీ యింటిపేరు మారిపోతుంది. నువ్వు మా అమ్మాయివి కాదు," అన్నాడు వియిట్ జెన్నీతో.

కేబిన్‌కి వెళ్ళే దారి సన్నబడిందా అన్నట్టు తోచింది జెన్నీకి.

"అక్కడ ఆ ఊళ్ళో పెద్ద పెద్ద రోడ్లు కాకుండా, రోడ్డుకి రెండువైపులా కాలి బాటలుకూడా ఉన్నాయి," అని చెప్పింది జెన్నీ.

"కొత్త ప్రపంచం చూసి వచ్చావు గనక, ఈ రోడ్డు బాగులేదు కాబోలు!" అంది ఆశ్చా అక్కగారితో.

తండ్రి కేబిన్‌లోకి వచ్చేటప్పటికి, జెన్నీకి ఏదో కొత్త కొత్తగా కనిపించింది. అంతా ఎప్పటి మాదిరిగానే ఉంది గాని, తనకీనాడు ఎంచేతనో కొత్తగా కనిపిస్తోంది. తనవాడైన లూయీ సంపాయించి తీసుకొచ్చిన ఆహారాన్ని, కేబిన్‌లో ఒక పక్కగా వుంచబోయే వేళకి, వర్తి పరుండేచోట వుంచమంది సేవర్డు.

జెన్నీ తన సామానులూ, తన భర్త సామానులూ, తమ తండ్రి పక్క దగ్గిర పేర్చటం, ఆశ్చా కోపంగా చూస్తోంది. లూయీ తమ ప్రయాణపు కబుర్లు చెప్పసాగాడు.

అతని ధోరణిలో అతను మాట్లాడుతున్నాడు. జెన్నీ, ఆ కేబిన్‌లో వున్న పడకల వంక, ఏవో ఏవో ఆలోచనలతో చూస్తోంది. ఒకటి: తమతండ్రి వర్త పడుకుండేచోటు. రెండవది: తనూ సేవర్డూ పడుకునేచోటు. ఇన్నాళ్ళూ తనూ, అక్క సేవర్డూ ఒక పక్కమీద పడుకునేవారు. ఈ రాత్రి, ఎంచేతనో, తను ఈ యింట్లో కొత్తమనిషిలా ఉంది. సాయంత్రం నుంచీ ఆ కొత్త దనం, మనసులో గూడుకట్టుకు వుంది.

రాత్రి భోజనాలయే సరికి కొంచెం ఆలస్యమయింది. భోజన మవగానే వియిట్ నిద్రపోయాడు. సేవర్డూ, ఆశ్చా పొట్టిగౌనులు వేసుకు, తమ పక్కమీదికి వెళ్లి తొందరగా పడు తున్నారు. వాళ్లు వారి భాగంలోకి వెళ్ళగానే లూయీ, జెన్నీ చూపించిన పక్కమీద వొరిగాడు. వెనువెంటనే భర్తని అనుస రించ లేకపోయింది జెన్నీ; యిది తన తండ్రి కేబిన్; అంచేత, మనసులో బెరుకు బెరుకుగా ఉంది. దీపం వెలుగులో ఏదో కుడుతూ కూచుంది.

"యింకా నిద్దర పోదలుచుకో లేదా? పొద్దుటే లేవాలి," అని అధికారయుతంగా పిలిచాడు భర్త.

ఇకమీదట జాగుచేసి లాభంలేదు. తక్కువ వెలుతురు వచ్చేటట్టుగా వుల్లలుసర్ది, చప్పుడు చెయ్యకుండా లూయీ

పరుస్న చోటుకివెళ్ళి పడుకుంది జెన్నీ. తెల్లారి ఎవరూ లేవక పూర్వం తను లేవాలి - అనుకుంటూ నడుం వాల్చింది.

ఆశ్చాని పక్కలో పెట్టుకు పడుకున్న సేవర్డుని తలుచుకు జాలిపడింది జెన్నీ. సేవర్డుకి తెలియదు గదా! అర్ధరాత్రివేళ మెలకువ వచ్చినప్పుడు, తన మనిషి అన్నవాడు పక్కనవుండి, నిద్దరలో కూడా, మీద చెయ్యివేసుకు పడుకున్నప్పుడు కలిగే మనోధైర్యం సేవర్డ్‌కి తెలియదు కదా! అలా మనని కాపాడే వాడు వున్నప్పుడు యింకేం కావాలి? - అనుకుంది జెన్నీ.

ఆమె వియిట్‌నీ ఆశ్చానీ తలుచుకు జాలిపడింది. వాళ్లు తను చూసిన ప్రదేశాలు చూడలేదు కదా! ఎంతకీ ఈ అడవినే పట్టుకు దేవుళ్లాడు తున్నారు!

తనంత అదృష్టవంతులు కాని అందర్నీ తలుచుకు జాలి పడింది జెన్నీ ఆ రాత్రి. తనవాడంటూ ఒకడు తనకి దొరికాడు. తండ్రి తిరిగివచ్చేదాకా అతను తన పుట్టింటివారిని కాపాడుతాడు. ఆ మాట అలా వుండగా, తను ఎవరూ చూడని విశాలప్రపంచం చూసి వచ్చింది. లూయీ తనూ యిక్కడ వుండటం కంటె, తమ స్వంత కేబిన్‌లో వుంటే యింకా బావుంటుందేమో!!

# 14. ఉత్సవం రోజున

నూలీ తప్పిపోయి సంవత్సరమయ్యాక, వర్త్ గురించిన మొట్టమొదటి కబురు తెలిసింది. ఓహియోనుంచి వచ్చిన ఒక పడవసరంగు చెప్పాడు ఆ వార్త. అది జార్జి రోబక్‌కి తెలిసింది. ఆ నోటా ఆ నోటా పాకి సేవర్డు చెవిని పడింది. అంతవరకూ వర్త్ చనిపోయాడని కొందరూ, బతికే వున్నాడని కొందరూ అంటూండేవారు.

తన దైనందిన కార్యక్రమం పూర్తి అయ్యాక, తండ్రి గురించి తెలిసినవార్తలోని నిజానిజాలు నిరూపించుకునేందుకు, సేవర్డ్, జార్జి రోబక్ కొట్టుదగ్గిరకి వెళ్లింది. ఈమె వెళ్లేటప్పటికి అతను కొట్టుమీద లేడు - ఏదో పరిసరగ్రామానికి వెళ్లాడు.

"వర్త్‌గురించి నేనేమీ చెప్పలేను. జార్జి రోబక్ తనకి తానుగా మీకు చెబుదామనుకుంటున్నాడు; అంచేత, నేను చెప్పకూడదు. స్వాతంత్ర్యదినంనాడు వస్తే ఆ ఉత్సవాలూ చూడవచ్చు, రోబక్‌నీ కలుసుకోవచ్చు" - అన్నాడు మొద్దావతారం.

"మేము ఆరోజున వస్తాం. కాని రోబక్‌ని కేబిన్‌వద్దనే వుండమను. ఎంచేతనంటే, ఒకవేళ మా నాన్న చనిపోయాడనుకో; అలాటప్పుడు మేము ఉత్సవంలో పాల్గొనడం బాగుండదు," అంది సేవర్డ్.

"సరే, ఆ విధంగానే చెబుతాను," అన్నాడు మొద్దావతారం.

కేబిన్‌కి తిరిగివచ్చాక సేవర్డ్ ఆశ్చాతో, తాము స్వాతంత్ర్య దినోత్సవానికి వెళ్తున్న సంగతి చెప్పింది.

"అయితే అక్కా, ఈ రాత్రి నువ్వు నాలుగు చిటికెల వుప్పు నోట్లో వేసుకుపడుకుంటే, రాత్రి వచ్చేకలలో, ఎవరైతే మంచినీళ్లు యిస్తారో, అతనే భర్త అవుతాడని, సాలీ విదర్స్ చెప్పింది నాకు," అంది ఆశ్చా.

"అటువంటి పిచ్చిపనులు చేసేందుకు, వుప్పు అంత తేలికగా దొరకదు ఈ అడవిలో" అని నవ్వేసింది సేవర్డ్. కాని, ఆశ్చా తను పట్టిన పట్టు విడవదలుచుకోలేదు. ఆ రాత్రి బలవంతాన, అక్కగారి నోట్లో వుప్పు వేసింది.

మంచినీళ్ల గురించిన కల సేవర్డుకి వచ్చింది. చెప్పలేనంత దాహం. నీళ్లు తెచ్చుకునేందుకు పాత్ర పుచ్చుకు బయటికి వెళ్దామంటే, బయట రెడ్ యిండియనులు. ఎవరో ఒక సిపాయి, నదిలోనుంచి తమ కేబిన్‌లోకి, నీటిగొట్టం పెట్టాడు. తను తన దాహంతీరా తాగి, ఆ గొట్టం సేవర్డుకి అందించాడు. తల పైకెత్తి చూసేటప్పటికి సేవర్డుకి, పోర్షియస్ వీలర్ కనిపించాడు.

ఈ కలగురించి తెల్లారేక, ఆశ్చాకి చెప్పకూడదనుకుంది సేవర్డు. వీలర్‌లాటి ప్లీడర్ని తను పెళ్ళాడటమా? నమ్మ శక్యంగా లేదు. అతనితో ఏనాడూ తను ఒక్కమాట మాట్లాడి ఎరగదు. అందరూ అతనిని ఏకాంతవాసి అనేవారు. చెవుడా మూగా అన్నట్టు, ఎవరితోనూ మాట్లాడేవాడేకాదు వీలర్.

అతను చాలా పెద్ద కుటుంబంనుంచి వచ్చాడట. బైబిల్‌లో భాగాలూ, పద్య కావ్యాలూ, రాజ్యాంగచట్టం - అనర్గళంగా వప్పజెప్పెయ్యగలడట. ఈ సంగతి మొద్దావతారమూ, జాక్ కెంచీ చెప్పారు.

స్వాతంత్ర్యదినంనాటి పొద్దుట, సేవర్డూ, ఆశ్చా,వియిట్‌లు అందరితోబాటు ఉత్సవ కార్యక్రమంలో పాల్గొనేందుకు వచ్చారు. సేవర్డుకి, తమ చుట్టుపట్లనున్నవారందరూ కనిపించారుగాని, జెస్సీ కనిపించలేదు. జెస్సీ యింకా రాలేదు ఎంచేత ? ఇటువంటి ఉత్సవానికి తీసుకురానంతటి చెడ్డవాడా లూయీ ? సేవర్డుకి జార్జి రోబక్ కనిపించాడు; తను అతని దగ్గిరికివెళ్లి తండ్రిగురించి అడగటంకంటె, అతనే తనని పలకరించడానికి వచ్చినప్పుడు, అడుగుదామనుకుంది. చాలాసేపు స్త్రీలమధ్య కూచుని వారి సంభాషణలో పాల్గొంది సేవర్డు. ఇంతలో జార్జి రోబక్ ఆమెవైపుగా వచ్చి, "సేవర్డు, మీ నాన్నగురించిన కబురు తెలిసింది. మిసిసిపిలోని ఫ్రెంచి సెటిల్‌మెంట్సులో ఉన్నాడట," అని అన్నాడు.

"అయితే, బతికేవున్నాడన్నమాట," అంది సేవర్డు.

"ఇక్కడి విషయాలు ఉత్తరం రాయించమని కబురు పంపాము. అతని యడ్రస్ మా చిట్టాపుస్తకంలో రాశాను.

నీకేమయినా కావలసివుంటే రాయి, తక్షణం వస్తుంది" అన్నాడు రోబక్.

"వర్తు బాగా సంపాయిస్తున్నట్టున్నాడు," అంది ఫ్లోరా.

"అడవిదున్నల చర్మాలు గుట్టలుగా పేరుస్తున్నాడట," అన్నాడు రోబక్.

కావలసినవాటికంటె ఎక్కువగా, అన్ని అడవిదున్నలని వేటాడటం మంచిదికాదు - అని అనుకుంది సేవర్డు. తనని ఉత్తరం రాయమన్నాడు - బాగుంది. కాని తమ భాషాజ్ఞానం, తన భాషాజ్ఞానమూ జెన్నీ భాషాజ్ఞానమూ కూడా, ఎ బి సి డి ల దగ్గిర ఆగిపోయిందని మర్చిపోయాడా?

ఉత్తరం రాసిపెట్టే వారి నెవరినైనా చూడాలి. ఎవరు ఉత్తరం రాసి పెడతారు? బక్‌మాన్ దస్తూరీ బావుంటుందంటారు; కాని, తను బక్‌మాన్‌ని అడగదలుచుకోలేదు. జార్జి రోబక్‌నీ అడగదలుచుకోలేదు.

"అతను యివ్వాళ యిక్కడికి వస్తాడని అనుకోలేదు," అంది మిసెస్ కోవెన్‌హోవెన్ అమాంత్రంగా.

ఎవరతను? సేవర్డ్ కనురెప్పలు పైకెత్తి చూసింది. ఎదురుగా జాక్ బెంచ్ కనిపించాడు; అతని సరసగా నడుస్తున్నాడు పోర్షియస్ వీలర్. అచ్చు తనకి కలలో కనిపించి నట్టుగానే ఉన్నాడు. క్రితం సారి తను చూసినప్పుడు షోకులరాయుడిలా ఉండేవాడు ఈ వీలర్; యిప్పుడు గెడ్డం పెంచి, టోపీ అదీ పెట్టి వాలుందాగా దర్జాగా కనపడుతున్నాడు. మూడు మూర్తులా

తనకి కలలో కనిపించిన వ్యక్తే! ఉత్తరం రాసిపెట్టమని యితనిని అడిగితేసరి! - అని అనుకుంది సేవర్డ్.

స్వాతంత్ర్య దినోత్సవ సంరంభం ప్రారంభ మయింది. తుపాకీ పేలుళ్ళూ, కోలాహలం, బాండువాయిద్యం, మేళ తాళాలూ, పాటలూ - అవన్నీ అక్కడి ప్రజల ఆనందోత్సవాలకి చిహ్నం. జెస్సీ యివి చూడలేక పోయిందే అని, సేవర్డ్‌కి మనసులో బాధగా ఉంది.

బక్‌మానూ, జార్జి రోబకూ ప్లీడరుగారితో మంతనాలు జరిపారు. ఆ పైన బక్‌మాన్ ప్రజలని నిశ్శబ్దంగా ఉండమని ఈ విధంగా ప్రారంభించాడు: "ఈ స్వాతంత్ర్య దినోత్సవం రోజున ఒక ఉపన్యాసకుడు మనకి లభించడం నిజంగా అదృష్టం. ఈయన, నేనూ మా చెల్లెలూ ఏ మసాచుసెట్స్ రాష్ట్రంనుంచి వచ్చామో, అక్కడ నుంచే వచ్చాడు."

అతనూ జార్జి రోబకూ పోర్షియస్‌పీలర్‌ని ఒక పెద్ద దుంగ మీాదకి ఎక్కించారు - అది ఉపన్యాసవేదిక అన్నమాట. దానిమీాద అతను నుంచునే వేళకి, చెట్టు కొమ్మమీాద నిలబడ్డ పెద్ద పక్షిలా ఉన్నాడు.

"దేశ భక్తులారా! రిపబ్లిక్ మిత్రులారా!! ఇక్కడ కొందరు సోల్జర్లు కనిపిస్తున్నారు. వారికి నేను మనవిచేసే దేమిటంటే, నేను చెప్పబోవు విషయం వారికి హితవుగా వుండదని. ప్రజా రాజ్యం వర్ధిల్లాలి; మిలిటరీ రాజ్యం నశించాలి!" అతని కంఠం

లోని దృఢత్వమూ, అతని హావభావాల ప్రదర్శనా అక్కడి ప్రేక్షక సముదాయాన్ని ఆకర్షించాయి.

సేవర్డ్ ఈనాటి వరకూ వీలర్‌ని సూటిగా చూడనేలేదు. ఇవ్వాళ కళ్లు పత్తికాయలంత చేసుకు చూసింది. ఈ వీలర్ యిక్కడ వున్న మనుష్యులందరిలోకీ వింతమనిషి. ఇక్కడ మూరు మూల కూచుని, ఏం ప్లీడరీ వెలిగిస్తున్నట్టు? అడవిలోకి వెళ్లి జంతువుల్ని వేటాడడు; పోనీగదా అని నదిగట్టున కూచుని చేపలనీ పట్టడు. 'నా కేబిన్‌లో నా మానాన నన్ను వుండనీయండి,' అంటాడట.

మొద్దావతారం చెప్పాడు; ప్రతి అమావాస్యకీ జార్జి రోబక్ కొట్టుదగ్గిరికి వచ్చి, తనకేదైనా ఉత్తరం వచ్చిందా అని అడుగుతాడట; విసుగులేకుండా ఎంతకాలంబట్టో ఆ ఉత్తరం కోసం అడుగుతున్నాడట; కాని అది ఏనాటికీ రాదు. ఆ ఉత్తరం ఎవరో స్త్రీ రాయవలసిన ఉత్తరమై వుంటుంది - అని సేవర్డ్ భావన.

చిన్న గెడ్డం, తీక్షణమైన చూపులూ గల వీలర్‌ని ఒకటికి రెండుసార్లు పరీక్షగా చూసి, - ఆ ఉత్తరం రాయవలసిన అమ్మాయి, యింతకాలం వుపేక్షచేయడం సబబుగాలేదు - అని అనుకుంది సేవర్డ్.

మధ్యాహ్నం దాటాక జెన్నీ వచ్చింది; ముందు లూయీ నడవగా, అతని వెనకగా నడుస్తూ వచ్చింది జెన్నీ. తనవాళ్ళని కళ్లతో పల్కరిస్తూ, "నాకంటె ముందువచ్చారే మీరంతా!" అంది.

"మధ్యాహ్నం విందుసమయానికి లేకపోయావు. ఎంత శుచిగా వున్నాయనుకున్నావ్ పదార్థాలు!" అంది మిసెస్ కోవెన్ హోవెన్.

"రోజులు ఎంత ఆనందంగా దొర్లిపోతున్నాయంటే, మధ్యాహ్నందాకా యివ్వాళ స్వాతంత్ర్య దినోత్సవమన్న సంగతి, నాకూ లూయీకీ జ్ఞాపకమే రాలేదు."

లూయీ ఆలస్యం చేశాడని జెన్నీ ఎన్నటికీ అనదు. యింటిగుట్టు ఆమెకి బాగా తెలుసు. అక్కనీ పిల్లలనీ చూడలేక పోవడం గురించి కూడా ఆమెపైకి ఒక్కమాట అనదు. వియిట్ అప్పుడప్పుడు జెన్నీ కేబిన్‌కి వచ్చేవాడు; అదైనా గొడ్లని తోలు కెళ్తున్నప్పుడు. లూయీ యింట్లోలేనప్పుడు సేవర్డ్ వచ్చి చూసి పోతూండేది చెల్లెల్ని. 'నామీద మీరు నేరాలు చెప్పుకుం టున్నారు కదూ' అని ఎగిరిపడేవాడు జెన్నీ భర్త. రాను రాను రాకపోకలు తగ్గిపోయినై.

లూయీకి తనమీద ఎందుకంత అక్కసో, సేవర్డుకి స్పష్టంగా తెలిసేది కాదు. అతను అధికారం చెలాయించబోతే, తను వూరుకోదు, ఆ మాటనిజమే. భార్యనేగాక, భార్యపుట్టింటి వారిని కూడా ఒక విధంగా పోషిస్తున్నానని, లూయీకి అహంభావం కాబోలు!

ఆ రోజున అక్కచెల్లెళ్లు ఎక్కువ మాట్లాడుకోలేదు. ఒకరిపక్కన ఒకరు కూచోగలగడమే, వారికి ఆనందదాయకంగా ఉంది. తండ్రిగురించిన వార్త సేవర్డు, జెన్నీకి చెప్పింది. జెన్నీ ఏమీ జవాబు చెప్పలేదు; ఆమె కళ్లు నృత్యవాటికవైపు ఉన్నాయి.

అందరూ డాన్సు చేస్తున్నారు; తనకూడా డాన్సుచేస్తే బావుంటు నని వుంది జెన్నీకి.

జేక్ రెంచ్ వచ్చి సేవర్డుని, "డాన్సు చేదామా?" అని అడిగాడు.

"మిగతావాళ్లకికూడా అవకాశం యియ్యి, జేక్" అంది సేవర్డు.

ఎవరైనా జెన్నీని డాన్సుకి పిలవాలని సేవర్డు అభిలాష. జెన్నీని పిలవడమంటే, అందరికీ భయమే; లూయీ ఆపైన చితక మోదుతాడు. తీరి కూచుని తగవు తెచ్చుకున్నట్టు అవుతుంది. వేళాపాళా శుద్ధీబద్ధం లేకుండా పేచీలు పెట్టుకోవడంలో మొన గాడు ఈ లూయీ.

పోనీ, లూయీ అయినా తన భార్యని డాన్సుకి పిలవ లేదు. ఆశ్చాని పిలిచి, ఆశ్చాతో డాన్సు చేస్తున్నాడు.

కొంచెం సేపయేటప్పటికి నృత్యంచేస్తూవున్న జంటలలో లూయీ ఆశ్చాలు కనపడలేదు సేవర్డుకి. ఒక పొదచాటునుంచి ఆశ్చా ముందు బయటికొచ్చింది; అవతలవైపునుంచి లూయీ వచ్చాడు.

సాయంత్రమయింది. లూయీ తనకోసం నిలబడివుండటం జెన్నీ చూసింది; సేవర్డు వున్నచోటుకి అతను రాడు; అందుకని జెన్నీయే ఒయలుదేరింది.

ఇంటికి వస్తున్నప్పుడు సేవర్డు ఆశ్చాతో ఒక్కమాట మాట్లాడలేదు. యిల్లు చేరుకున్నాక, ఆశ్చాకి గట్టిగా బుద్ధి

చెబుదామనుకుంది. నిలవదీసి అడిగితే, మరీ మొండికేస్తుందేమో నని మళ్లీ సంశయించింది. ఈ చీకాకులకి దూరంగా ఉన్నాడు తండ్రి - హాయిగా ఆ ఫ్రెంచి సెటిల్‌మెంట్సులో ఎక్కడో ఉన్నాడు.

తండ్రికి ఉత్తరం వ్రాయించడం మంచిదా? వ్రాస్తే, జెన్నీ యిలా పెళ్లి చేసుకున్నట్టు తెలియబరచాలి. ప్రయోజనం?? పక్క మీద వాలి, తనకి కలిగిన స్వప్నంగురించి ఆలోచించింది సేవర్డు. అదంతా అయిపోయింది. పీటర్‌తో స్నేహం చేసేందుకు, ఉత్తరం వ్రాసిపెట్టడమనే కారణంకూడా లేదు యిప్పుడు.

# 15. వేటగాడు

వియిట్ లూయీల మధ్య ఒక రహస్యం ఏర్పడింది. తను ఒకనాడు జెన్నీ కేబిన్‌కి వెళ్ళినప్పుడు, - యింకా ఎన్నాళ్ళకి, - అని అడిగాడు వియిట్ లూయీని. 'తొందరలోనే' అని సమాధానం చెప్పాడు లూయీ. ఒకరోజు సాయంత్రం లూయీ, మిసెస్ కేవెన్ హావెన్‌తో, వియిట్‌ని ఒకసారి తను కేబిన్‌కి రమ్మనమని చెప్పవలసిందిగా కోరాడు.

లూయీ ఎందుకు రమ్మన్నాడో వియిట్‌కి తెలుసు. 'ఎప్పుడు తెల్లారుతుంది? ఎప్పుడు వెళ్తాను?' అను ఆదుర్దాతో ఆ రాత్రి సరిగ్గా నిద్రపోనేలేదు. మర్నాడు పొద్దుటే జెన్నీ కేబిన్‌కి వెళ్ళాడు. లోపల ప్రవేశించినప్పట్నుంచీ అతని కళ్లు నలువైపులా చూస్తున్నాయి; దేనినో వెతుకుతున్నాయి. లూయీ తుపాకీ ఒక మూలనివుంది - అంతే, అంతకంటె యింకేమీలేదు. ఇంకొంచెం పరీక్షగా చూసేప్పటికి, ద్వారబంధానికి పైగా, మరొక తుపాకీ కనిపించింది. ఈ రెండవ తుపాకీకి కొంత కర్ర, కొంత లోహమూ ఉంది. కుర్చీపీట వేసుకు ఆ తుపాకీ దించాడు. దాని

పొడవు వియిట్ ఎత్తుకంటె సుమారు ఒక అడుగు ఎక్కువ. తన చేతిలోనుంచి వాళ్లు తీసుకుంటారేమో అను భీతితో, "ఈ తుపాకీ నేను పట్టుకోగలను," అన్నాడు వియిట్.

"ఈ తుపాకీకిగాను రెండు లేడి చర్మాలు నేను బజానాగా యిచ్చాను. మిగతా వెల నువ్వు తర్వాత చెల్లించవలసి వుంటుంది," అన్నాడు లూయీ.

వియిట్ తల వూపాడు. ఇక ఏ చెట్టుమీదచూసినా, తను వేటాడిన జంతువుల చర్మాలు వేలాడుతూంటాయి; ఆ బాకీ తీర్చడ మెంతసేపు ??

"ఇంటిదగ్గిర ఈ సంగతి తెలియదుకదూ ?" సేవర్డ్ పేరు నోటితో చెప్పడంకూడా లూయీకి యిష్టంలేదు. "నేను చెప్పినట్టు చెయ్యి. ఏదైనా జంతువుని వేటాడి, మాంసం తీసుకువెళ్లగలిగితేనా, తుపాకీ యింటికి పట్టుకెళ్ళు. లేదా, ఎక్కడైనా దాచేసి వెళ్లు. డాబుగా తుపాకీ పుచ్చుకువెళ్లావా, అది నీకు కాకుండా అవుతుంది," అని హితవు బోధించాడు లూయీ.

"తుపాకీ చేతిలో ఉన్నమీదట జంతువుని వేటాడటం ఎంతసేపు ?" అని ప్రగల్భాలు పలుకుతూ, ఆ తుపాకీ మోసుకు వెళ్లిపోయాడు వియిట్.

జెన్నీ కేబిన్ తలుపులు మూసుకోవడం వెనకనించి వినిపించింది. ఏ చెట్టుచాటునైనా ఎలుగుబంటి కనిపించవచ్చు; ఏ పొదలమాటునైనా గుంటనక్క దాగివుండవచ్చు. తుపాకీ చేత బుచ్చుకు పచార్లు చేస్తున్నాడు ఆ కుర్రవాడు. అక్రోటు తోపు.

లోకి మొదటిగుండు పేల్చాడు. గుండు పేలీపేలగానే అడవి యావత్తూ దద్దరించినట్టయింది. గుడ్డపీలికలా వెనక్కిపడిపోయాడు వియిట్. గబగబాలేచి నుంచుని, కాళ్ళల్లోకి శక్తితెచ్చుకు, వచ్చిన జంతువు ఎటువంటి రూపురేఖలుగలదో చూసేందుకు, చెట్టుమొదలువద్దకి వచ్చాడు. జంతువుకాదు సరిగదా, ఆఖరికి ఒక్క వృశత అయినా కనిపించలేదు ఆ చుట్టుపట్ల.

ఆ రోజంతా అడవులవెంట తిరుగుతూనే వున్నాడు. వేటాడటమంటే తను అనుకున్నంత తేలికకాదు. ఒకదాని తర్వాత ఒకటి, తుపాకీలోవున్న ఏడుగుండ్లూ ఖర్చయాయి. ఆఖరి గుండు ఒక చెట్టు మొదట్లోకి వెళ్ళి, అక్కడ యిరుక్కుంది. తుపాకీలో ఒక్కగుండు కూడా మిగలలేదు. చెట్టు మొదట్లో యిరుక్కున్న గుండు తుపాకీలో మిగిలివుంటే ఎంత బాగుండేది - అనిపించింది వియిట్ కి. ఈ తుపాకీ ఎక్కడదాస్తాడు? లూయీకి ఏమని చెబుతాడు? మళ్ళీ తుపాకీ గుళ్ళు ఎలా లభిస్తాయి?

అతికష్టం మీద తుపాకీ మందు సంపాయించ గలిగాడు వియిట్. తన తుపాకీ ఖాళీగావున్నప్పుడు కనిపించిన రెండు లేడి పిల్లలూ, మళ్ళీ తను అక్కడికి వచ్చేటప్పటికి మాయమయాయి. అది లేళ్ళ ఆహారసమయం కాబట్టి, ఆదారమ్మటే వెళితే అవి కనిపించక పోతాయా అను నమ్మకంతో ముందుకిసాగాడు. చీకటి పడే వేళ అవుతోంది. గొడ్లని యింటికి తోలుకువెళ్ళాలి. ఈఒక్కరోజుకీ ఆశ్చా ఆపని చూడకపోతుందా? - అనుకున్నాడు.

నలభై ఏభై అడుగులు వేసేటప్పటికి, పొదవెనక ఏదో తల అగుపించింది. తుపాకీ సరిచేసుకు సిద్ధంగా ఉన్నాడు వియిట్.

పొద్దుట్నుంచీ తిరుగుతున్నా అతనికి అలిసినట్టుగా లేనేలేదు. తుపాకీ నిశ్చలంగా పట్టుకు, వంగి నడిచాడు పొదదాపులకి. అప్పుడు పళ్ళు బిట్టగరచి తుపాకీ నొక్కాడు. భూన భోంతరాళాలు బద్ద లయే ధ్వనితో తుపాకీ తేలింది. అతని చెవులకేదీ వినిపించలేదు. కళ్లకేదీ కనిపించలేదు. ముందుకి ప్రాకి, బూడిద వర్ణంలోవున్న కర్రమీద కూచున్నాడు.

అది కర్రకాదు - అడవిజంతువు ఒకటి అక్కడ పడివుంది. అది నిజంగా చచ్చిందా, లేక మగతవల్ల కళ్లు మూసుకుందా? ఏమైనా దాని పీకమీద కత్తివేటు వేసేదాకా నమ్మకూడదు - అనుకున్నాడు వియిట్. మొలలోని కత్తి తియ్యబోయే వేళకి జంతువు లేచి నుంచుంది; వియిట్ దానిపీపుమీద ఉన్నాడు. దాని మెడమీద నున్న జూలు రెండుచేతులతో గట్టిగాపట్టుకు కూచున్నాడు. మొలలోని కత్తి తీసేందుకు వ్యవధి చాలదు.

ఇంక, ఆ జంతువు వలయాకారంలో రకరకాలుగా తిరగడం మొదలెట్టింది. పీపుమీద నున్న ప్రాణిని ఏదో ఒక విధంగా కిందకి బోర్లాతొయ్యాలని దాని ప్రయత్నం. పిచ్చిగా గంతులేసింది; చెట్లకి పీపురాసింది; కిందు మీదుగా ఎగిరింది; ఎన్ని చేసినా వియిట్ తనపట్టు జారవిడవలేదు. ఇన్ని కుప్పిగంతుల లోనూ, తన మొలలోని కత్తి ఎలా పడిపోకుండా వుందా అని, వియిట్‌కి కూడా ఆశ్చర్యమేసింది. అతని మోకాళ్ళు కొట్టుకు పోగా, వేడిరక్తం కారుతోంది.

"అది నన్ను తోసెయ్యగలదు; కాని నేను తోయబడను. అది నన్ను చంపగలదేమోగాని క్రిందికి తోసెయ్యలేదు." అంత మొండిగా ఉన్నాడు వియిట్.

విసుగు చెందిన ఆ అడవిమృగం తిన్నగా పరిగెత్తడం మొదలెట్టింది. అదే సమయమని గ్రహించాడు వియిట్. మొల లోని కత్తి నేర్పుగాతీసి, దాని కంఠంలో పొడిచాడు.

*          *

మర్నాడు మధ్యాహ్నంవేళ అయింది వియిట్ కేబిన్‌కి వచ్చేటప్పటికి. అడవి జంతువూ, తుపాకీ, చినిగిన బట్టలు - వీటితో మనిషి ఎలా వుండాలో అలా ఉన్నాడు.

ఆశ్చొ గెంతుతూ ఎదురొచ్చింది గాని సేవర్డు కూచున్న చోటు నుంచి కదలకుండా కూచునివుంది.

"నిన్న సాయంత్రం ఏమయావు? నీ గొడ్లని నేను తోలుకు వెళ్ళాననుకున్నావు కాబోలు, పాపం! - అటువంటి పొరబాట్లు పడకు."

"ఇంక నేను పశువులకాపరిపని చెయ్యక్కర్లేదు. అదీ గాక నాకు టైము వుండదు. ఈ జంతువుని నా చేతులతో నేను కాల్చి చంపాను." నమ్మరేమో అన్నట్టుగా తుపాకీ చూపించాడు వియిట్.

"ఎవరి తుపాకీ అది?" అని అడిగింది సేవర్డు.

"నాది." లూయీ మాట్లాడుతాడే ఆ విధంగా దర్జాగా చెప్పాడు.

"ఎక్కడ దొరికింది యిది?"

"జార్జి రోబక్ దగ్గిర."

"ఈ తుపాకీ లూాయిాది. అవునా కాదా? నిజంచెప్పు," అని దండించింది సేవర్డు.

"తుపాకీ మోయగలిగేటంత పెద్దవాడినయాా నన్నాడు లూాయిా. జెన్నీ కూడా అదేమాట అంది," అని సమాధానం చెప్పాడు వియిట్.

ఆమాట వినగానే సేవర్డు మనస్సు కొద్దిగా కలుక్కుమంది గాని ఆ బాధని పైకి కనపడనీయలేదు. అవును, లూయిా ఎన్నాళ్ళని పెళ్ళాం తరఫు వాళ్ళని పోషిస్తాడు? అసలే అతనిది నిలకడలేని కాలు. ఒక విధంగా కట్టిపడేసినట్టయింది అతనికి. తను యిక్కడనుంచి తప్పించుకునేందుకు, ఈ పదకొండేళ్ళ కుర్రవానికి, తుపాకీ పట్టడం నేర్పాడన్నమాట.

తమ్ముడు తీసుకువచ్చిన మాంసాన్ని అక్కగారు జాగ్రత్త చేసింది.

"కొద్దిగా టీ తాగాక, ఆ రక్తపు మరకలు తుడుచుకుందువు గాని," అంది సేవర్డు.

చినిగిపోయిన బట్టలు విప్పించి, ఆ పదకొండేళ్ల కుర్రవాని వొళ్ళంతా చన్నీళ్లతో తుడుస్తున్నప్పుడు, సేవర్డుకి లూాయిా మీాద కోపమే వచ్చింది. ఎలుగుబంటి కొరికేసి నట్టయింది వియిట్ వొళ్ళంతా. ఈ వియిట్ యింక పెద్దవాడవుతాడు; తండ్రికి మల్లేనే అడవులవెంట పడిపోతాడు కాబోలు - అనుకుంది సేవర్డు. ఈ

మృదువైన చెక్కిళ్ళ మీద వెంట్రుకలు మొలుస్తాయి; ఈ మెత్తని దేహం కరకుబారుతుంది; ఈ చిన్న పాదాలు యింక నిలకడ లేకుండా తిరుగుతాయి - అని తమ్ముడి గురించి ఎన్నో తలంపులు వచ్చాయి. ఆ చిన్న పాదాలు పెద్దవై ఎక్కడెక్కడ తిరిగేదీ, అక్కగారికి అనవసరం. తన తండ్రి పధ్నాలుగోయేట అన్నదమ్ము లని వదిలిపెట్టి వచ్చాడట; మళ్లీ వాళ్ళని చూడలేదట. తన తల్లి విషయం తెలిసినదే కదా! పెళ్లి అయాక వాళ్ళ వాళ్ళని చూసి ఎరగదు.

చిన్నతనంలోనే ప్రేమలు; పెద్దయాక ఎవరిదారి వారిది.

# 16. మార్గమధ్యం

ఆ చలికాలం నాటికి వియిట్, తుపాకీ పేల్చడంలో నేర్పరి అయాడు. చీకటిపడే వేళకి, కేబిన్ చుట్టుపక్కలకి తోడేళ్ళు వచ్చేవి. ఇక వాటిని చూసి, కుక్కలు గొంతులు పోయేదాకా అరిచేవి.

సేవర్డుకి ఆ చలికాలంలో ఎందుకనో మనసు బాగులేదు. జెన్నీ గురించిన ఆలోచనలు పదే పదే వస్తూండేవి. లూయీకి తనకీ మాటలులేవు గనక జెన్నీ యిక్కడికిరాదు ఆశ్చా వెళ్లి జెన్నీని చూసి వస్తూండేది. అదీగాక లూయీకి ఆశ్చామీద కోపం లేదు.

ఇప్పుడు ఆశ్చా కూడా యింటిపట్టున వుండటం లేదు; సాలీవిదర్స్‌కి పనిసాయం చేస్తోంది. జెన్నీ కేబిన్‌కి వెళ్ళేందుకు వియిట్ ఒక్కడే మిగిలాడు.

వియిట్ నిన్ననే ఒక జింకని కొట్టాడు. జింకమాంసం కొంత జెన్నీకి యిచ్చిరమ్మంది సేవర్డు. వియిట్ వెళ్ళేటప్పటికి

లూయీ లేడు, ఎక్కడికో వెళ్ళాడు. ఏదో కూనిరాగం పాడు కుంటూ, పిట్టనొకదాన్ని సాయంగా పెట్టుకు, జెన్నీ కర్రలు కొడుతూండటం చూశాడు వియిట్. అసలు ఆ పాట వినేటప్పటికే అతనికి ఆశ్చర్యమయింది.

"వియిట్!" అంది జెన్నీ ఉత్సాహంతో.

"నువ్వు మొన్న ఆశ్చా వెళ్తున్నప్పుడు, మంచు పడకుండా కప్పుకునేందుకని యిచ్చిన శాలువా తీసుకొచ్చాను," అన్నాడు వియిట్.

"తొందరేమొచ్చింది? తర్వాత యివ్వవచ్చుగా! లోపలికి రావూ?" అని ఆప్యాయంగా అడిగింది జెన్నీ తన తమ్ముడిని.

నిప్పులపొయ్యిలో కట్టెలులేక బూడిద వుండటం గమనించాడు వియిట్. బహుశా, లూయీ కొత్తకట్టెలు వేదామనుకుంటున్నాడు కాబోలు - అని వెంటనే సరిపెట్టుకున్నాడు.

తను తీసుకొచ్చిన జింకమాంసం, మాంసం వేలాడదీసే చోట తగిలించాడు.

"ఎందుకిది? లూయీ బోలెడంత మాంసం తీసుకొచ్చి పడేస్తున్నాడు. నువ్వు ఎప్పుడూ వుత్తచేతులతో రావుకదా! తీసుకొచ్చినది వద్దనకూడదు," అంది జెన్నీ.

అక్క లూయీని వెనకేసుకొస్తోందిగాని యింట్లో వస్తువులు సమృద్ధిగా ఉన్నట్టులేవే! - అనుకున్నాడు వియిట్.

"ఈపూటకి యిక్కడ భోంచెయ్యకూడదూ? నేను వండుతాను," అంది జెన్నీ.

కర్రవాని ముఖంలో పెద్దతనం కనిపించింది. "అలాగే, నువ్వు వంటపని చూడు, ఆ కట్టెలు నేను కొట్టిపెడతాను," అన్నాడు వియెట్.

"అక్క కష్టపడటం ఎందుకు? నేను కొట్టిపెడతాను," అనుకుంటూ, నిప్పులపొయ్యికిగాను రెండు దుంగలు నరుక్కు వచ్చాడు వియెట్, భోజనాలవేళ అయ్యేటప్పటికి. వంట అయింది రమ్మంది - జెన్నీ. ఆ పూట తమ్ముణ్ణి లూయీ కూచునేచోట కూచోపెట్టింది. తమ్ముడు వచ్చినందుకు ఎంతో ఆనందంగా ఉంది ఆమెకి.

వేటాడేందుకు తొందరగా వెళ్దామనుకున్నాడు గాని జెన్నీని చూసేటప్పటికి కాళ్లు కదలలేదు వియెట్‌కి. పోనీ, యిక్కడే యింకొంచెంసేపు వుండి, కర్ర నరకడంలో అక్కకి సాయపడదామనుకున్నాడు.

"ఈ కర్ర చాలు. ఇంక అక్కర్లేదు," అంది వియెట్.

మాట్లాడుకునేందుకు మనిషి సాయం కోసం ఆమె బెంగ పెట్టుకున్నట్టు వుంది. అక్క, తమ్ముడిని ఈ మాటా ఆ మాటా అడగసాగింది. అప్పుడే పొయ్యిలో వుంచిన దుంగని అగ్ని నాలుకలు ఆవరిస్తున్నాయి.

"నేవర్డు బావుందా?"

వియెట్ తల వూపాడు.

"ఏం చేస్తోంది యిప్పుడు?"

ఏంచేస్తోందో జ్ఞాపకం తెచ్చుకునేందుకు ప్రయత్నించాడు. ఏం చేస్తోంది? ఆశ్చ్వాకి గౌను కుడుతోంది. ఆ గౌనుకోసం ఆశ్చ్వా సేవర్డుని వేపుకుతింది.

"ఈ మారు ఆశ్చ్వా ఆ గౌను వేసుకుంటే చూస్తాను," అంది జెన్నీ.

"ఆశ్చ్వా యిప్పుడు యింటిదగ్గర ఉండటంలేదు. సాలీ విదర్స్‌కి సాయంగా ఉంటోంది. సాలీవిదర్స్‌కి కవల పిల్లలు పుట్టారు నీకు తెలియదా?"

"ఆడ పిల్లలా మొగ పిల్లలా...కొందరు ఎలాగయినా అదృష్టవంతులు."

వియిట్ ఆమెవంక అర్థరహితంగా చూశాడు. మాంసం దొరకని ఈ కరువురోజుల్లో యిద్దరు పిల్లలేమిటి అని అందరూ అనుకోగా, అక్క యిలా అంటుందేమిటి!

"వెలుతురు వుండగా యిల్లు చేరుకునేందుకు, నేనింక బయలుదేరాలి," అన్నాడు వియిట్. నెత్తిమీద టోపీ పెట్టుకు, కేబిన్ తలుపు తెరిచాడు. బయట కనిపించే అడవి, భయంకరమైన చలితో, నిశ్శబ్దంగా ఉంది. తన బుజం మీదుగా జెన్నీ చూస్తోంది. తన మాదిరిగా జెన్నీ తమ కేబిన్ దగ్గిరికి రాలేదుకద! సేవర్డ్‌ని చూడామనుకున్నా చూడలేదుకద! తను ఒక్కర్తె యిక్కడ వుండాల్సిందే!!

"ఈ వేసవిలో మాట్లాడే పిట్ట నొకదాన్ని నీకు సంపాయించిపెడతాను. దానికి నువ్వు మాటలు నేర్పితే, అది నీకు సాయంగా ఉంటుంది," అన్నాడు వియిట్.

"నాకంత భయమేముంది? రెండు రోజుల క్రిందటే లూయీ వచ్చి వెళ్ళాడు. ఆశ్చా చెప్పివుండాలి - ఆ రోజునే దానికి ఆ శాలువా యిచ్చాను. ఆశ్చా ఒక్కతె వెళ్ళలేదని లూయీ దిగబెట్టి వచ్చాడు," అంది జెన్నీ.

లూయీ తనని దిగబెట్టినట్టు, ఆశ్చా చెప్పనిదే, వియిట్ కి ఎలా తెలుస్తుంది?

"చీకటి పడేవేళ అయింది. నేనింక బయలుదేరుతాను," అన్నాడు వియిట్.

"నేనూ కొంతదూరం వస్తాను," అంది జెన్నీ.

శాలువా నెత్తిమీద కప్పుకు బయలుదేరింది జెన్నీ. అక్కా, తమ్ముడూ కొంతదూరం నడిచారు. ఎన్నాళ్ళబట్టో గుర్తుగా వున్న ఒక విరిగిన చెట్టు మొదలు దగ్గిరికి వచ్చాక, "యింక నువ్వు వెనక్కి వెళ్లు," అన్నాడు వియిట్. తమ్ముని పలుకులలో నాన్న కంఠధ్వని వినిపించింది జెన్నీకి.

ఆమె నేత్రాలు తమ్ముని వంక ఎంతో ప్రేమగా చూశాయి.

"అక్కని అడిగానని చెప్పు," అంటూ అయిష్టంగా వెనక్కి తిరిగింది.

* *

కేబిన్‌లోకి వచ్చి తలుపు మూసుకుంది జెన్నీ. నిప్పుల పొయ్యిలో మంట తక్కువగా ఉండటంవల్ల కేబిన్ చిరుచీకటిగా ఉంది. కాని ఆ చిరుచీకటిలోని బంగారుకాంతి జెన్నీ మనసుకి

ఆనందం చేకూర్చింది. ఎంచేతనంటే తమ్ముడు వచ్చివెళ్లాడు; మానవహృదయాలలోని సహజానురాగం అటువంటిది. తమ్ముడు ఒక్కడే వచ్చాడు; కాని తమ్ముడినిచూసినంత మాత్రాన తన వాళ్ళందరినీ చూసినట్టయింది. తండ్రివర్తునీ, తప్పిపోయిన సూలీనీ, చనిపోయిన జేరీనీ అందరినీ చూసినట్టనిపించింది. ఆశ్చా సాలీవిదర్స్ యింట్లో పసిపాపలకి జోలపాట పాడుతోందా? దాని బొంగురు కంఠానికి ఆ పాపలు జడుసుకోరు కద!

పిల్లలు మహా గమ్మత్తుగా ఉంటారు. వాళ్ళ జీవనమే ఒక విస్మయానందం. అదేం తమాషావో గాని, అక్కర్లేదనుకున్న వారికి కలుగుతారు; కావాలనుకున్న వారికి కలగరు. కొందరు రాత్రింబవళ్లూ దేవుడికి మొక్కుకున్నా, కన్నీటి చారలు మిగులు తాయి గాని ప్రయోజనం ఉండదు.

లూయీ లేనప్పుడు చీకటి పడగానే నిద్రపోయేది. కాని ఈ రోజున త్వరగా నిద్దర రావడం లేదు. కేబిన్‌తలుపు తెరిచి బయటికి చూసింది. వెలుపల అంతా ఆఫ్రికాఖండపుమహారణ్యంలా వుంది. కుక్కల అరుపులు తప్ప లోకమంతా నిద్రపోతోంది. వియిట్ ఈ పాటికి యిల్లుచేరుకుని, సేవర్డుతో, యిక్కడికబుర్లు చెబుతూ వుంటాడు - అని భావించింది జెన్నీ. సేవర్డు ఎక్కువ మాట్లాడడు. కాని, ప్రేమ తెలిపేందుకు మాటలే కావాలా?

ఏవో ఆకులు నిప్పులపొయ్యిలో పడటంతో జెన్నీకి మెల కువ వచ్చింది. పొగ గొట్టంలోనుంచి ఏదో లోపలికి ప్రవేశించ బోతోంది. తమ్ముడు తీసుకొొచ్చి యిచ్చిన పచ్చిమాంసం వాసన, అది పసిగట్టి వుంటుంది. జెన్నీ చటుక్కున పక్కమీాద నుంచి

లేచింది. పొగగొట్టంలోనుంచి రెండు ఎర్రటి కళ్లు భయంకరంగా చూస్తున్నాయి. సందేహంలేదు - అదేదో దుష్టమృగం. ఒక్కొక్కప్పుడు ఈ అడవిజంతువులు అతి సాహసానికి పూనుకుంటాయి. తన తండ్రి ఈ కేబిన్‌ని పునర్నిర్మిస్తున్నప్పుడు పైకప్పుకి కొంచెం ఘట్టికర్ర ఉపయోగించాడు - అందువల్ల తను బతికి పోయింది.

ఆ దుష్టజంతువు, తన ముట్టెని పొగ గొట్టంలో పెట్టి, హూంకరిస్తోంది. జెన్నీ చేయగలిగిందేమిటంటే, నిప్పుల పొయ్యిలో మంట ఎక్కువ చేసి, ఆ పొగకి వేడికీ, ఆ జంతువు వెళ్లిపోయేట్టు చూడటం. లోపల ఒకే ఒక్క దుంగ ఉంది. తమ్ముడు యింకో రెండు దుంగలు నరుక్కువస్తానంటే, తనే వద్దంది. ఈ ఒక్క దుంగ తెల్లారేదాకా మండుతుందా అని భయపడుతూ, మంట పెద్దది చేసింది. ఇంటి కప్పుమీదనున్న జంతువు ఒక పక్కగా జరిగింది.

* *

వారం రోజులపాటు సేవర్డ్ వియిట్‌ని, అడపాదడపా అడుగుతూనే వుంది, జెన్నీ గురించి.

ఆరోజు మధ్యాహ్నం మొద్దావతారం వచ్చాడు. అతని మొహంమీది చెమటలు చూసేటప్పటికి, గబగబా పరిగెత్తుకుంటూ వచ్చాడని అనిపించింది సేవర్డ్‌కి. కుర్చీపీట చూపించి, కూర్చోమంది. వియిట్ ఉన్నాడా? - అని అడిగాడు. వియిట్ యింట్లో లేడు; మొద్దావతారం కుర్చీపీటమీద చతికిలబడ్డాడు. మొద్దావతారం మనసులో ఏదో ఉంది. పైకి చెప్పడంలేదు-అని

సేవర్డ్‌కి తెలుసు. చెప్పదలుచుకున్నప్పుడే చెబుతాడు - అని తన యింటి పనిలో నిమగ్నురాలయింది సేవర్డ్.

చీకటి పడబోయేముందు మొద్దావతారం వెళ్లాడు; అతను వెళ్లిన కాసేపటికి వియిట్ వచ్చాడు.

"నేనూ...వియిట్‌ని. నీకు చెప్పలేదుటగా అతను?" అన్నాడు వస్తూనే.

ఏమిటి? - అన్నట్టుగా మొహం పెట్టింది సేవర్డు.

"లూయీని యింగ్లీషులేక్స్‌దగ్గర చూశామని జార్జి రోబక్‌కి ఎవరో చెప్పారట." వియిట్ నెమ్మదిగా అన్నాడా మాటలు.

"లూయీతో యింకొకరు ఉన్నారట - మనకి తెలిసిన వాళ్ళు," అన్నాడు వియిట్.

"మనకి తెలిసినవాళ్ళా? ఎవరుచెప్మా?" అంది సేవర్డు.

"నీకూ నాకూ బాగా తెలిసినవాళ్ళు."

"వాళ్ళు యిటువైపు వస్తున్నారా, లేక పైకి వెళ్తున్నారా?"

"పైకి వెళ్తున్నారట."

"ఆ రెండోవాళ్ళు ఎవరు - జెన్నీ కాదుకదా!"

"జెన్నీ కాదు. ఇప్పటికీ గ్రహించ లేకుండా వున్నావా?"

సేవర్డు పై పెదవిమీద చిరుచెమటలు పోశాయి. ఇదంతా ఏదో అగమ్యగోచరంగా ఉంది.

"ఆఖ్ఖాని సాలీవిదర్స్ యింటిదగ్గిర ఎన్నాళ్ళక్రితం చూశావు?" అని అడిగింది సేవర్డు వియిట్‌ని.

"నేనీమధ్య అటువైపుగా వెళ్ళనే లేదు. అసలు మన ఆశ్చా పనిలోకి రావడం మానేసి చాలారోజులైందని యిందాకనే చెప్పాడు యాండమ్స్. యింకొక రెవరినో కుదుర్చుకున్నారట వాళ్ళు."

ఆశ్చా, సాలీవిదర్స్ యింటికంటూ, బయలుదేరి అయిదారు రోజులవుతుంది. చెల్లెలు ముఖంలోని తళతళలు సేవర్డు గుర్తించింది గాని యింత కొంప మునుగుతోందని అనుకోలేక పోయింది. అసలీమధ్య ఆశ్చాలో నాజూకు పెరిగింది. చెక్కిళ్ళు ఎఱ్ఱపడటం, ముఖం వికసించడం, జబ్బలు ఏపుతేరడం - యివన్నీ తను ఒక కంట కనిపెడుతూనే వుంది గాని యిలా ఉపద్రవం ముంచుకొస్తుందని భావించలేక పోయింది సేవర్డు.

మర్నాడు పొద్దుట వియిట్‌తో, "అబ్బాయ్, యివ్వాళ జెన్నీ కేబిన్‌కి వెళ్ళాలి మనం," అంది సేవర్డు.

తమ్ముడు దారితీయగా, అక్క వెంటనడిచింది. కేబిన్ పొగగొట్టంలో నుంచి పొగ కనపడకపోయే సరికి సేవర్డు ప్రాణం చివుక్కుమంది. దగ్గిరకొచ్చి, కేబిన్ పరిసరాలు చూసేటప్పటికి గుండె ద్రవించింది. తన చెల్లెలు యిటువంటి నట్టడవిలో కాపరం చేస్తోందా?

కేబిన్ గుమ్మం దగ్గిరికివచ్చి ఆగారు వియిట్ సేవర్డులు. లోపల ఏవో మాటలు వినిపిస్తున్నాయి. జెన్నీ ఎవరితో మాట్లాడుతోందో - అని యింకొంచెం పరిశీలనగా వినేసరికి, అవి మాటలు కావు, పాట అని, తేలింది. కత్తిపుచ్చుకు సైనికుడు యుద్ధభూమికి

వెళ్తూండగా ప్రియురాలి విలాపమది. అదే చరణం పదే పదే పాడు కుంటోంది జెన్నీ.

సేవర్డు, వియిట్ యిద్దరూ తలుపు తెరుచుకు లోన ప్రవేశించారు. కేబిన్ అంతా బోసిగా ఉంది; లోపల ఒక్క వస్తువు లేదు - నిప్పుల పొయ్యికి పనికొచ్చే దుంగలు మాత్రం ఉన్నాయి.

జెన్నీ ఆకారంచూసి సేవర్డు ఆశ్చర్యపోయింది. "జెన్నీ!" అని పిలిచింది.

జెన్నీ వియిట్ దగ్గిరకొచ్చి, "ఎవరామె?" అన్నట్టుగా చూసింది.

"ఓ - సేవర్డుకదూ! అక్కని చూసి చాలారోజులయింది. అంచేత గుర్తు పట్టలేకపోయాను. అయితే మీ యిద్దరూ నాకు తెలిసినవాళ్లే!" అంది జెన్నీ పిచ్చిపిచ్చిగా.

"యింట్లో వస్తువులన్నీ ఏమయాయి?" అని అడిగింది సేవర్డు.

"అటకమీద పెట్టాను."

జెన్నీ పిచ్చిధోరణికి, సేవర్డు జాలిపడటంతప్ప, ఏమీ చేయలేకపోయింది. అసలువార్త చెవిని వేస్తేగాని ఈ జెన్నీ యిక్కడనుంచి కదలదని, "మన యింటికి వెళ్దాం పద," అని ప్రారంభించింది సేవర్డు.

జెన్నీ వెనక్కి తగ్గి, "లూయీ వచ్చే వేళకి నేను యింట్లో ఉండాలి," అంది.

"లూయీ యింకరాడు. మన ఆశ్చాని తీసుకు పారి పోయాడు," అంది సేవర్డు క్రూరంగా. ఈ చేదుమందు ఇప్పుడో యింకో క్షణానికో యివ్వక తప్పదు.

"నేను అటువంటి అబద్ధాలు నమ్మను. అతని సంగతి మీకేం తెలుసు, నాకు తెలుసు! ఆశ్చా ఎవరింట్లోనో పని చేస్తోందిగా!"

"నమ్ము నమ్మకపో, ఉన్న సంగతి చెప్పాం. నిన్ను యిక్కడనుంచి మన కేబిన్‌కి తీసుకు వెళ్లేందుకు వచ్చాం," అంది సేవర్డు.

బాగా చిక్కి, శల్యావశిష్టమై వున్న జెన్నీని, యిద్దరూ చెరో రెక్కా పట్టుకున్నారు. చిన్నపిల్లని నడిపించినట్టుగా బల వంతాన తీసుకుపోయారు. ఎప్పటికప్పుడు విదిలించుకు పారిపోవా లని ప్రయత్నించేది జెన్నీ. ఆమె ఆ విధంగా పారిపోవడం తమకి యిష్టం లేదన్నట్టు నిలబడ్డాయి అడవి చెట్లు. ఆ చెట్లనందు నుంచి తెల్ల మేఘమొకటి ఆకాశంమీద కనిపించింది. ఆ తెల్ల మేఘాన్ని చూడగానే సేవర్డుకి ఏదో శాంతి లభించినట్టయింది.

# 17. ఒకరోజున

జీవితం వెనకటివలె తేలికగా ఉండటం లేదు. సేవర్డే అన్ని పనులూ చేసుకోవలసి వస్తోంది. విలియట్ తనకిగాను, ప్రత్యేకంగా ఒక చిన్న కేబిన్ కట్టుకు, అందులో ఉంటున్నాడు. పోతే, జెన్నీ ఆరోగ్యం కొంచెం కుదుట పడింది. చిక్కిపోయిన వొంటికి బలం పట్టింది. చూపులకి మనిషి బాగుంది. ఎటొచ్చీ, మునుపటికి మల్లే పాటలు పాడటం లేదు. మనుష్యులలో పడ్డప్పటినుంచీ జెన్నీ పరిస్థితిమారిందనే చెప్పవచ్చు.

'ఒకరకంగా నేను అదృష్టవంతురాలినే' అనుకుంది సేవర్డు. ఎంచేతనంటే, మంచీ చెడ్డా చూసేందుకు తమ్ముడు ఉన్నాడు; ఆశలు వొదులుకున్న చెల్లెలు మళ్ళీ మనుష్యులలోపడి, నలుగురిలో తిరగ గలుగుతోంది. చిన్న కేబిన్, వెచ్చటిపక్క, కడుపునిండా తిండీ, ఆదరంగా చూసే మనుష్యులు వున్నమీదట యింకేం కావాలి? ఏమీ అక్కర్లేదు.

ఒకరోజున ఫ్లోరా గ్రీర్ కేబిన్‌వద్ద పెళ్లిహడావుడి జరుగు తూండగా జేక్ బెంచ్, "విస్కీ-సీసాలతో వివాహం పూర్తికాదు," అని నవ్వుతూ అన్నాడు.

"అవునవును. నువ్వన్నది నిజం," అని ఒక వృద్ధురాలు తన ఆమోదం తెలిపింది.

కప్పు తర్వాత కప్పు కాళీచేస్తున్న జేక్, పీపా దగ్గిరికి వెళ్లే టప్పటికి, పీపాకూడా ఖాళీగాఉంది. రోబక్ కొట్టుకి వెళ్లి యింకో అరపీపా పట్టుకురమ్మన్నాడు జేక్ మొద్దావతారంతో.

"ఏమిటో ఇవ్వాళ అదే పనిగా త్రాగుతున్నావ్!" అని వారించింది ఒక పెద్దావిడ జేక్‌ని.

"జేక్ పెళ్లి సంబంధాల ప్రయత్నంలో ఉన్నాడు. మనుషులతో మాట్లాడని ఆ ప్లీడరుకి పెళ్లికుమార్తెని కుదురుస్తా డట," అన్నారు ఒకరు.

అక్కడవున్న ఆడవారిలో, పెళ్ళికోసం ఎదురుచూస్తున్న పిల్ల, ఇడీ ఒక్కర్తే.

"నాకే పెళ్లిచేసుకోవాలని వుంటే, అతన్ని చేసుకోవడం ఏమి కర్మం! అతని తలదన్నిన వాడిని చేసుకుంటాను," అని మొహంమీద కొట్టినట్టు అనేసింది ఇడీ.

పెళ్లికావలసిన ఆడపిల్ల అంత దుడుసుగా మాటలాడటం పాపహేతువనీ సిగ్గుచేటు అనీ అక్కడ సమావేశమైన వృద్ధ నారీమణులు భావించారు. కాని, జేక్ బెంచ్ లాంటి వాడికి అలాంటి జవాబు చెప్పవలసిందే - అని అనుకున్నారు మళ్లీ! సేవర్డు

యిటూ అనలేదు, అటూ అనలేదు. ఆ ప్లీడరు, ఆ పోర్షియస్ వీలర్, తన చెల్లెలు జెన్నీకి మల్లే అడవుల్లోనే పడివుంటే పిచ్చిపట్టడం తథ్యం - అని అనుకుంది. అడవులుమనిషిని ఏకాకిగా చేసి, పిచ్చి పట్టిస్తాయి; వాటిలో ఆ గుణం ఉంది; పాపం, ఆ ప్లీడరుకి తెలియదు - అని తలపోసింది సేవరు.

అందరూ గుంపుగావున్న చోటునుంచి కొంచెం పక్కగా వెళ్లి, జేక్‌ని పిలిచి, "ఆ ప్లీడరుని నా కేబిన్ దగ్గిరకి తీసుకురా. అతనికి అభ్యంతరం లేకపోతే నేను పెళ్ళాడుతాను," అంది సేవర్డు నిశ్చలంగా.

మిసెస్ కోవెన్‌హావెన్, జెన్నీలు సేవర్డు వంక ఆశ్చర్యంగా చూశారు. జెన్నీ ముఖంలో ఏదో బెదురు కనిపించింది.

"నువ్వేమీ కంగారు పడకు. కంగారు పడవలసినదేమీ లేదు యిందులో. నాకు చాలరోజులబట్టి అతనిమీద వుంది," అని చెల్లెల్ని సమాధాన పరుస్తున్నట్టుగా చెప్పింది సేవర్డు.

"పౌర్ణమి నీచేత అలా పలికించకుండా వుంటే చాలు," అంది జెన్నీ.

సేవర్డు తూర్పుదిక్కుగా తిరిగి చూసింది. ఆకాశాన పసుపురంగులో పూర్ణచంద్రబింబం కనిపిస్తోంది. 'ఇవ్వాళ పౌర్ణమే కావచ్చు; కాని పౌర్ణమివల్ల నేను అలా మాట్లాడలేదు' - అని తనని తను సరిపెట్టుకుంది. అంత తెలిసిన మనిషి అడవులలో తల దూర్చి, తన విద్యని వృథాచేసుకోవడం మంచిదికాదు గనక, తను పెళ్లాడుతానంది.

జేక్ ఈ విషయం స్క్వాయిర్‌తో చెప్పాడు; స్క్వాయిర్ వచ్చి సేవర్డుని అడిగాడు.

"నీకతనిని పెళ్లిచేసుకోవాలని నిజంగా ఉందా?" అని అడిగాడు స్క్వాయిర్.

"ఉంది" అంది సేవర్డు.

జేక్, అతని మిత్రులూ వెళ్ళి ప్లీడర్ని పట్టుకొచ్చారు. అతనొక ఎలుగుబంటిలా ఉన్నాడు. ఇన్నాళ్ళబట్టీ ఈ ఎలుగుబంటిని ఏ ఒక్క అమ్మాయీ చేజిక్కించుకోకపోవడ మేమిటి? - అని ఆశ్చర్యపోయింది సేవర్డ్. అతని నుదురూ అతని కళ్ళూ ఆమెని ఎంతగానో ఆకర్షించాయి.

పెళ్లికొడుకు తరపున మొగవాళ్ళంతా ఆర్భాటం చేస్తున్నారు. తన వెనకగా అంతమంది స్త్రీలు, ఎప్పుడు గుమిగూడారో సేవర్డుకి తెలియనేలేదు. అంతా నిముషాలమీద జరిగిపోయింది.

స్క్వాయిర్ అడిగాడు ప్లీడర్ని: "పోర్షియన్ పీలర్, నీవు సేవర్డు లకెట్ నామధేయురాలైన ఈ కాంతని, చట్టసమ్మతమైన సహచారిణిగా అంగీకరించ దలుచుకున్నావా?" తరవాత చెప్పవలసినది మర్చిపోవడం వల్ల, వెంటనే పుస్తకంలోని పేజీ తిరగేసి, "అంగీకరించ దలుచుకున్న పక్షంలో, భగవంతుడు నిన్ను రక్షించుగాక!" అన్నాడు.

స్క్వాయిర్‌కి యీమాదిరి పెళ్లిళ్లు చేయించడం అంతగా అలవాటులేదు. అందుకని మాటలకి తడుముకోవలసి వచ్చింది.

"నేను, పోర్షియన్ పీలర్‌ని, ఈ పరిసరప్రాంత పౌరుణ్ణి, కుమారి లకెట్‌ని, న్యాయ సమ్మతమైన వైవాహికపు భార్యగా

స్వీకరిస్తూ, సదరు కాంతని సర్వవేళలా కాపాడి రక్షించ గలందు లకూ, ఆమెకి తగు సలహాలనిస్తూ సద్వర్తినిగా చేయుగలందులకూ, ఈ దేహంలో ఊపిరి వున్నంతవరకూ ఆమె నేనూ పవిత్రమైన దాంపత్య బంధంలో జీవించగలందులకూ దీక్ష వహిస్తున్నాను. నా దీక్షని కాపాడుకోగల శక్తి భగవంతుడు ప్రసాదించుగాక!" అని ప్లీడరు గుక్క తిప్పుకోకుండా అనేటప్పటికి, వింటున్న వాళ్ళందరూ చకితులయారు. ఊపిరిపీలుస్తున్నంత తేలికగా అతని నోటివెంట మాటలు వచ్చాయి.

స్క్వాయిర్ సేవర్డుచేత వివాహ కాండకి సంబంధించిన వాగ్దానాలు పలికించాడు. అక్కడితో పెళ్లితంతు ముగిసినట్టే. పెళ్లికొడుకు తరఫున మొగవాళ్ళూ, పెళ్ళికూతురు తరఫున ఆడ వాళ్ళూ కొంత వినోద కార్యక్రమం సాగించాక, పెళ్లి భోజనా లయాయి.

"ఈ ప్లీడరు యింక వంటింటి కుందేలు అయిపోతాడు," అని వేళాకోళమాడాడు జేక్ టెంచ్.

"వంటింట్లో కట్టెయ్యను - ఏం ఫరవాలేదు," అంది సేవర్డు.

మిగతావాళ్లు మాటలలో కల్పించుకొని, చినికిచినికి గాలి వాన గాకుండా అడ్డుపడ్డారు. ఎవరైనా పాటలుపాడితే బావుండు నని అన్నప్పుడు, జెన్నీ చికాకు మొహం పెట్టింది. ఏమైతేనేం, మొత్తంమీద ఆనందంగా గడిచిపోయింది.

అతిథులందరూ వెళ్ళిపోయాక సేవర్డు లోపలికి వచ్చింది. హోర్షియస్‌ని యింకా అతని స్నేహితులు పట్టుకు వొదలలేదు.

సేవర్డు కేబిన్‌లోకివచ్చిన కాసేపటికి, జేక్ అతనిని తీసుకువచ్చి గుమ్మం దగ్గిరనుంచి లోనికి నెట్టబోయాడు.

"ఇంతవరకూ చేసిన హంగామా చాలదా? అతనికి విశ్రాంతి నివ్వదలుచుకోలేదా?" అని సేవర్డ్ సూటిగా అడిగే వేళకి, జేక్ అతని మిత్రులూ ఆశ్చర్యపోయారు.

"మేము చేసిన మేలుకి యిదా ప్రత్యుపకారం?" అన్నాడు జేక్.

"ఎందుకులే, ఆమె అటు తిరగగానే, మనవాడు పారి పోయివస్తాడు" అన్నాడు మరొకడు.

సేవర్డ్ గుమ్మందగ్గిరికి వచ్చి, "వెళ్లిపోదలుచుకుంటే, యిప్పుడైనా వెళ్లవచ్చు. నేను అతనిని కట్టిపడెయ్యలేదే!" అని అంది. ఎవరిమీదా ఆధారపడకుండా బతకగలిగిన మొగరాయు డిలా ఆమె ఆ మాటలు అనేటప్పటికి, గుమ్మందాకా వచ్చిన మిత్రులందరూ తోకముడిచారు. తలుపులోన వేసి, వంట సామగ్రి దగ్గిరికి వెళ్లింది సేవర్డు. పోర్షియస్ నిప్పులపొయ్యి దగ్గిర నిలబడి, చలి కాచుకున్నాడు కొంచెంసేపు.

విపరీతమైన చలికి పళ్ళు గజగజ లాడించడం గమనించి, తండ్రి ఫున్నికోటు అతనికి యిచ్చింది. సూలీని వెతకడానికి తండ్రి వెళ్లిననాటి నుంచీ, ఆ కోటు అదేకొయ్యని వేలాడుతోంది. ఆ కోటువేసుకుని, షర్టూ పంట్లామూ ఆరబెట్టుకోమంది.

నిప్పుల పొయ్యిలోని మంట పెద్దది చేశాక, గది కొంచెం వెచ్చబడింది.

"స్నానంచేసి ఎన్నాళ్ళయింది?" అని అడిగి, వేన్నీళ్ళు కాగు తీసుకొచ్చి అతని ముందు పెట్టి, వొళ్ళు శుభ్రంగా కడుక్కోమంది. అంత మురికిగా నిద్రపోకూడదంది. అతను ఆమె చెప్పిన ప్రకారమే చేశాడు.

"పోర్షియస్ వీలర్, మీకో ముఖ్యమైన విషయం చెప్పదల్చుకున్నా. నా దగ్గరనుంచి మీరు పారిపోనక్కర్లేదు. మీకు ఎప్పుడు వెళ్ళిపోవాలని అనిపిస్తే, అప్పుడు చెప్పండి. మీకు కడుపునిండా భోజనంపెట్టి, బట్టలూ అవీ యిచ్చి పంపిస్తాను. అంతేగాని, పారిపోవలసిన పనిలేదు."

ఆ విషయం చెప్పేసి, అతనికి పడుకునేందుకు పక్క చూపించి, వంటసామాను సర్దుకు, నిప్పులపొయ్యిలోని మంట సరిచూసి వచ్చేటప్పటికి, అతను పక్క అంతా ఆక్రమించుకు, ముసుగు కప్పుకున్నాడు. తను మరోకవక్క పరుచుకుందామనుకుంటూండేవేళకి, ముసుగు పొరలెత్తి, సగౌరవంగా పిలిచే ఆహ్వానం, ఆమె గమనించింది. నాగరికులూ సంస్కారం తెలిసినవారూ అటువంటి లాలిత్యమే కనబరుస్తారని తను వింది.

"నేవర్డు, ఈ వివాహబంధం మన మనసుల్ని ఏకం చేయాలి" అన్నాడు పోర్షియస్ వీలర్.

# 18. మార్పు

సేవర్డుకి ఆడపనీ మొగపనీ తెలుసు. తమ కేబిన్ చుట్టూ వున్న చెట్లు వెర్రిగా ఎదుగుతున్నాయి. యివ్వాళ కొడితే, రేపటికి మళ్ళీ మొలుస్తున్నాయి.

రెండు గొడ్డళ్లు చక్కగా పదును పట్టించి తీసుకువచ్చింది సేవర్డు. కొత్తనాణెములవలె అవి ధగధగ లాడుతున్నాయి.

చెట్లు నరికేందుకు రమ్మనమని సేవర్డు భర్తని పిలవలేదు; ఆ శబ్దం విని అతనే వచ్చాడు. అంత చదువుకున్నవాడికి చెట్లు నరికే అవస్థ ఏమిటి? - అని ఆమె విచారపడింది. ఒకరోజు పని చేసేటప్పటికి, అతని అరిచేతులు పుళ్ళుపడి, కదుములుకట్టాయి. కాని యిద్దరూ శ్రమించక తప్పదు. ఎప్పటికైనా ఆహార ధాన్యాలూ కాయగూరలూ పండించుకు, మచ్చిక జంతువులని పెంచుకోలేమా? - అని వారి ఆశ. ఒక ఆదివారంనాడు, కొండ గుట్ట ఎక్కి చూడగా, పధ్నాలుగు యిళ్ళు కనిపించాయి. తమ పరిసరాలలో కూడా ఒక చిన్న ఊరు తయారవుతోంది. ఊరు పెరిగిన కొద్దీ చెట్లు తగ్గిపోతాయి; యిటువంటి కేబిన్ తో యిక పనిఉండదు. తమది ఆ చుట్టుపట్లకి మొట్టమొదటి కేబిన్; చెట్ల

సముద్రంలోని మొదటి కేబిన్. తమ కేబిన్ పొగగొట్టంలోనుంచి వచ్చే అ పొగ ఎంత చక్కగా ఉంటుందో!!

*  *

చివరికి ధాన్యం వేశారు; ఆ మొక్కలు మొలిచినరోజు ఎంత పుణ్యదినమో వారికి!! ఆకాశాన్నీ మేఘాన్నీ ఆశగా చూశారు. ప్రకృతి వారిని కనికరించింది.

అడవిచెట్లు నరికేసి, ధాన్యపు గింజలు నాటడం నేర్చుకుంటారా దంపతులు; ఒకరోజున జేక్ బెంచ్ పోర్షియస్ వీలర్ దగ్గిరకి ప్లీడరుసలహాకోసం వస్తాడు. వీలర్ విద్య యిన్నాళ్ళకి రాణింపుకి వస్తుంది.

సేవర్డు ప్రపంచం ఒక విధంగా మారిపోయింది. తాము ఈ అడవులలోకి వచ్చిన మొదటిరోజుకీ ఈ నాటికీ ఎంత తేడా!! లోకం ఎంత మారిపోతోంది. కొన్నాళ్ళయేటప్పటికి తాము గొడ్లని పెంచుకోవచ్చు కూడా.

చేతికిదగ్గ పనీ, హృదయంనిండా ప్రేమా గల పత్నుల కంఠంలో మెదిలే రాగమెరగని పాట, సేవర్డ్ గుండెల్లో గుబగుబలాడింది. తనకి తనుగా, కంఠంలో ఆగిపోయే పాటల్ని పాడుకోని గృహిణి ఉండదు. సేవర్డ్‌కి ఏదో నూతనశాంతి లభించినట్లయింది.

చిట్టిచెల్లెలు సూలీ యింక కనపడకపోవచ్చు. కాని తనకి పుట్టేది ఆడపిల్ల అయితే ఆ పేరు పెట్టుకుంటుంది. జీవితమంటే యింతే: జనన మరణాలు, ఆకలి దప్పులూ, ఎండా వానలూ, హేమంత వసంతాలూ అన్నీ కలగాపులగంగా ఉంటాయి. 'యిదే కావాలి, అదొద్దు' అనేందుకు మనమెవరం??